

నివేదితా సోదరి.

నివేదిత

సుబోధనీ గ్రంథమాల:—నెం 4 రు

# నివేదిత.

ఇది

కొమాండూరు - రామకృష్ణమాచార్లు, బి. యే. గారిచే

రచియింపఁబడి

యం. ఆర్. కృష్ణరావు & కంపెనీవారిచే

ప్రకటింపఁబడినది.

వైశ్యాముద్రాక్షరశాల, నెల్లూరు.

1914.

 [వెల 0-6-0]

## ప్రకాశకుల విజ్ఞప్తి.

శ్రీ నివేదితా సోదరీమణియొక్క జీవితచరిత్రము నీ చిన్న పొత్తమునం దిమిడ్చుటకై యెంతయో ప్రయాసతో నిక్కార్యమును సంస్తవనీయముగ నొనర్చి ప్రకటనార్థమై మాకు బంపిన మామిత్రులగు శ్రీమాన్ కొమాండూరు రామకృష్ణమాచార్యులు, బి. యే. గారికిని, మాగ్రంథమును ముద్రణమునకై సౌకర్యముల నన్నియు నొసంగి స్వకార్యమువలె జూచుకొనుచు మాయుద్యమమునకు ప్రోత్సాహమొసంగు శ్రీవైశ్యా ముద్రాలయాధిపతులకును మేము మిక్కిలి కృతజ్ఞులము. ఈగ్రంథకర్తగారికి గ్రంథరచనయం దిదియే ప్రథమయత్నమగుటవలన కొన్నియెడల దోషము లుండవచ్చును. సుధీజనులు తప్పులను క్షమించి వానిని మాకు దయతో దెలియజేసిన, ద్వితీయముద్రణము తటస్థమయ్యెనేని తప్పులసవరించి ప్రచురింతుము.

D

# తల్లిప్రేమ తనబిడ్డయెఱుంగు.

---

బండేపల్లి వంశమునజనించి

కోమార్లమూరి వంశము నలంకరించి

కుసుమసమాన మృదుహృదయము వలనను

కరుణారస స్ఫూర్తివలనను వెలింగిన

వారికెల్లరకు గౌరవాస్పదమైన మాయమ్మ

**రంగమ్మ**

ప్రియంబైన స్మృతికి

అంకితము

1

Gudipati Visvanatha Rao
Telaprolu

ఓం

# నివేదితా సోదరి జీవితము

## ప్రవేశకము.

ఈయమ ఇంగ్లాండు దేశములో జననమొందెను. ఈమెపూర్వనామము 'మార్గరెట్ నోబ్ల్'. 'నోబ్ల్' అను నాంగ్లేయ పదమునకు 'ఆర్య' యని యర్థము. ఈయమ శ్రీ వివేకానందుల శిష్యురాలై హిందూ దేశము వచ్చిచేరి యచటనొక తాపసివలె జీవింపనూని 'నివేదిత' యను నభీష్ట యపరనామముగైకొనె. నివేదితయన నివేద్యము కావించినది. ఈమెను మరెవ్వరును నివేద్యముగా నిచ్చినది లేదు. తననుతానే నివేద్యము చేసుకొనినది. ఎవరికితన్ను నివేద్యముగాచేసి యర్పించుకొనినది? తొలుత శ్రీ రామకృష్ణ పరమహంసగారి ప్రియతమ శిష్యులైన వివేకానందుల దేశోద్ధారణోద్యమమునకును, రామకృష్ణవివేకానంద నామద్వయ సూచిత పుణ్యాత్మ ద్వయంబునకును, వీరిమనం

బుల దేవతవలె యధిష్ఠించియున్న భరతవర్షమునకును తన్ను సమర్పించుకొనినది.

ఈమహనీయురాలికి హిందూదేశపు పూర్వోన్నతి విషయమైయున్న గౌరవమును, యిప్పుడు మిగిలియున్న యాగౌరవమునం దపారానురాగమును, యాగౌరవశేషమును నాశనము జెందింపకనిల్పి పూర్వోన్నతస్థితికిఁ దెచ్చు పరిశ్రమయును, మరియు హైందవ స్త్రీల స్థితిని బాగుపరుప నీమె పెంచిన కోరికలును, మరియొక స్త్రీయందు కానలేము. మనదేశ క్షేమమునకై యీయమ పడినపాట్లనన్యసామాన్యములు. ఈమె యొనర్చిన సేవారూపమైన తపస్సు లతితీక్ష్ణములు. మనదేశీయు లెల్లరకును నీయమ నిష్టదేవతగాను దేశదేవతగాను జేకొనవలెను. ఇది మిక్కిలి క్షేమకరము. మనకై పాటుపడిన యీశుద్ధాత్మను గౌరవించి పూజించుట మన కృతజ్ఞతఁజూపు. ఈమెను మఱచితిమా కృతఘ్నుల మగుదుము. ఈయమ జీవితమును మనబాలురకును బాలికలకును తెన్నుతెలిపెడి నొకశుద్ధచరిత్ర ప్రభావ స్వభావములు వారికి గోచరంబులై యుండును.

ఈమె పరమును దర్శించుటయు నీమె సచ్చరిత చింతనమును నీమె లిఖితంబుల పఠనమును మనంబున కుత్సాహము కలుగజేసి శ్రేయోమార్గంబుల జూపు.

సంస్కృత భాషలోని యలంకార శాస్త్రములం దొక ప్రతీతికలదు. కావ్యములలో నాయకుని ధీరోదాత్తత్వము ననగా సర్వవిషయ ఘనతను వర్ణింపనెంచిన, యతని శత్రువు చాలగొప్పవాడనియు అట్టివాని నీ కావ్యకథానాయకుడు మించెననియు చెప్పుటచే నాయకుని యసదృశత్వము స్థాపింపబడుచున్నది. మహనీయులని పేరుబొందినవారొకరింగూర్చి ప్రస్తుతియొనర్చిన, నట్టివారి మహిమ సందేహింప తగినదికాదు. వారిం గురించి సమగ్రవర్ణన యసాధ్యంబని చెప్పిరింకవారెట్టి వారుగానుందురో యూహింప నక్కరలేదు. రాముని గురించి వాల్మీకి గానమొనర్చినందున మనదేశమున రాముని లోకాతీత శుద్ధచరితము, శాశ్వతముగా నిల్చెను. రాముడు దేవుని యవతారమనియు నెంచుట కలదు కదా. అట్లే యీయమ చరిత్రంబును మనము వ్రాయుటకు పూర్వము, యీమెను గురించి మహనీయులు నుడివిన స్తోత్రవాక్యముల నిచ్చట గొన్ని పేర్కొనెద.

ఇంగ్లాండులో తొలుత నీమె శ్రీ వివేకానందుల చూడవచ్చి యుండినపుడీమెనుగురించి వారు "హిందూ దేశ స్త్రీజన క్షేమాభివృద్ధికై నేనుకొన్ని యుపాయములఁ దలపెట్టియున్నాడ. వాని నవలంబించి సాధించి, కొనసాగించదగిన బిడ యీామెయే." యని చెప్పియున్నారు. కలకత్తాలోని "ఎంపైర్" (సామ్రాజ్యము) అను పత్రికకు సంపాదకుడు, మిస్టర్ ఎ, ఎఫ్, జే. బ్లేర్ (బ్లేర్ మిశ్రుడు) "మార్గరెట్ నోబ్ల్' అనగా 'ఆర్యజనతాకుసుమము'—'నివేదిత' యనగా 'సమర్పిత' ఈయమను గురించి ఈమె పూర్వపు ఆంగ్లేయ నామము పట్టి చూచినను, అపరమైన హైందవ నామమును పట్టి చూచినను నరాంశసంభూతులకు మరెవ్వరికిని వారి నామములంత యన్వర్థముగా పొసగియుండెనా? ఆమె నామోచ్చరణమే మన మనంబులకు విశుద్ధాత్మత్వమును, అగాధ భక్తిని గోచరపరచు. ఈమెను పరిచయానుభవముచేత నెరింగిన వారికి, యీామె మూర్తిం గొన్న యంతరాత్మయో యనితోచు. ఈమెమనతో మాటాడునపుడు మనలను తనవిమర్శన దృష్టిచేత చూడచూడ నగ్నింబోలు శుద్ధచరిత్రమైన నీమెయొక్క

సౌశీల్యతేజశ్శిఖలు వెలువడినట్లుండు. ఈశిఖలలో మన దోషములు కమలిపోవు. ఆమెయొక్క సూక్ష్మదృష్టికి పాత్రుడైన పురుషుడుగాని స్త్రీగాని యాక్షణము మొదలెద్దియో యొక యపూర్వ నిర్మలత్వమును బల మును తనదేహముంజొచ్చి నట్లుండునని వ్రాసియు న్నాడు. ఇండియాపత్రిక సంపాదకుడైన ఎస్, కె, రాట్ క్లిఫ్‌మిత్రుడు. "ఈయమ మైత్రినినెరింగినవారికీయామైత్రి తమకీలోకంబున కలుగదగిన యమూల్యవరప్రసాదమని యెంతురు. పట్టు వదలకయు, యెడలు మరపియు, సంవత్సరముల పర్యంతమీామె చేసిన పరిశ్రమయు, విమ ర్శతోను సత్యాసక్తితోను నీమెచేసిన సత్యాన్వేషణ మును, యెకప్పుడును తగ్గనిధైర్యమును, హృదయౌ దార్యమును, కరుణార్ద్రితయును, నీమెనెరింగిన వారె మనంబులకు సువిదితంబులు. ఇంతియెగాక మహామారి జాడ్యమునకును క్షామబాధలకును పాలైనవారి కుప చర్యలచేసి వారిని రక్షించుటయు, దీనులకు తోడ్పడి వారి కష్టకాలములో ననుదిన సహవాసినియు సహ చారిణియునై ధైర్యములువల్కి వారిమనోవ్యధల నివా రించుటయు, సౌఖ్యలక్ష్మీచేతను ధనలక్ష్మిచేతను చేయి

విడువబడిన వారలకై తనయసమానబుద్ధిని యుదార తతో వినియోగ పరచుటయు మొదలుగాగల దివ్య గుణంబులును సువిదితంబులె. ఇట్టి సుగుణంబులతో తేజరిల్లు నీదై వజాతయొక్క మనోపరిచయమును మైత్రి యనుభూతియు కలిగియుండినయనుతలంపే వీరికి యాత్మ గౌరవమును తృప్తిని గలిపునని నుడివియున్నారు.

హిందూదేశవిషయమున శ్రద్ధాభక్తులవహించినవా రైన హెచ్. డబ్ల్యు. నెవిన్సన్ మిత్రుడు "అగ్ని లోని యంశములను వివరించి యవి యియ్యబడియని పేర్కొనబూనుట యెంత నిరుపయోగమో శ్రీనివేదితా సోదరీమణిని గురించి రెండుపుటలలో వ్రాయబూను టయు నంతనిష్ప్రయోజనమె. ఆమెనెద్దియో యొక జ్యోతి యావరించియుండు. ఆమెమాటలే కావు ఆమె యొక్క సత్త్వసంపన్న రూపమంతయు నామనంబున కగ్నియోయని తోచుచుండు. నివేదిత చరిత్రమును పట్టి చూడలాభనష్టములందైక్యభావముంగనియుద్ధసన్నద్ధు డవు గమ్మను గీతలోని బోధనను ముఖ్య మంత్రముగా నీమెగైకొనినట్లు కన్పడు. ఇందుచెప్పినట్లు యీయమ

యెల్లప్పుడును కష్టముల నెదుర్కొన సన్నద్ధురాలై యుండెను. మోచన నైమిత్తిక యుద్ధములో నీమె యొక యుద్ధభటునివలె పాటుపడుచుండు నని, వ్రాసి యున్నాడు. తత్త్వవేత్త ప్రొఫెసర్ (పండితుడు) ఛెయిర్ 'ఆమెయొక నక్షత్రము వంటి' దని వర్ణించి యున్నాడు. నక్షత్రమన్నంతనే తృప్తిచెందక తుదకీమె సూర్యసమానయని చెప్పి నిలిపినాడు. పుణ్యజన్ములు మరణాంత మాకసమున నక్షత్రములై యుందురని మన వారికొక నమ్మికకలదు. పాశ్చాత్యుడైన నీయన పుణ్య చరిత్రయైన నివేదితను గురించి యట్లు చెప్పియున్నాడు. మనవారినమ్మిక మూఢపునమ్మికయని మనమెంతుము. రసవంతముగ నొకమహనీయుని వర్ణింపబూనిన నిట్టి యుపమానముల సహాయము కోరుట మనవారికేకాక పాశ్చాత్యులకును సహజమైయున్నది. ఈయన యొక సూర్యుడనిచెప్పి, యీసూర్యబింబ మస్తమించిపోయిన మనకు గొప్పదుఃఖము వాటిల్లుననిచెప్పె. ఈయనవంటి శుద్ధచరితలను స్వార్థత్యాగినులను గనుటదుర్లభము.

1903 వసంవత్సరము మదరాసులో జరిగిన హిందూ దేశీయ మహాజన సభ కర్గ్రాసనాధిపతియు, వంగదే

శపు న్యాయవాదులలో ప్రముఖులునగు శ్రీ యుత డాక్టరు రసవిహారి ఘోసుగారీమెను గూర్చి ప్రసంగించుచు నిట్లుచెప్పిరి. "నివేదితా సోదరి నారీమణులకు శిరోభూషణము. ఆమె తన జీవనమంతయు పరోపకారమునకే వినియోగపరచెను. స్వార్థమునకుగానిస్వదేశమునకుగాని గాక, మనకు మన హిందూదేశమునకే యావజ్జీవము పాటుపడెను. క్షామపీడితులకన్న మిచ్చుటవలనను, మహామారి వ్యాధిగ్రస్తుల కుపచారము చేయుటవల్లను, మన బాలిక లుత్తమ స్త్రీలుగా నభివృద్ధి జెందు మార్గములనేర్పి తన్మూలమున రాబోవు సంతతి వారు త్తమాదర్శపూరితులగునటుల ప్రోత్సాహపరచుట వల్లను, మఱియు ననేకవిధములయామె మనయెడ తన ప్రేమను వెల్లడిపఱచెను. నూతనమై, ఉత్కృష్టమై, సత్యాన్వితమై, గౌరవాస్పదమైయొప్పుజీవనమున మన యువజనులహృదయములందు తీవ్రమైన అభిలాషను కలుగజేసిన ఖ్యాతి కీమెయే విశేషముగ పాత్రురాలు. అట్టి స్వార్థత్యాగినియొక్క పావనజీవితమును మనహృదయసీమలయందజస్రము నిలుపుకొని మనకృతజ్ఞతను జూపుదము." మఱియు వంగదేశీయ యాధునిక కవి

చంద్రుడు శ్రీ రవీంద్ర నాథ ఠాగోర్ గారు యీమె యొక్క పరసుఖ దురంధరత్వమును గూర్చిచాలవర్ణించి మెప్పుచూపియున్నారు. లోకోపకారార్థమై కష్టపడు విషయమున నీమె యెంతమాత్రమును వెనుదీయుట లేదు. దేహదౌర్బల్యము కాని, సుఖాపేక్ష గాని, బాల్యమునుండి పనుపడిన యూరపుఖండజీవుల వాడుకలుగాని, బంధువులయెడ పామరముగాని, తనదేశస్థుల వలన వాటిల్లిన యనర్థావగాని తానెవరికై కష్టపడెనో వారుచూపిన యశ్రద్ధగాని, వారిస్వకార్యధురంధరత్వముకాని, నీయమయొక్క ప్రయత్నంబుల సళ్ళింప శక్తికలవికావు. సర్వకాల సర్వావస్థలయందు నీమె యితరులకు సుఖమును గరపు ప్రయత్నమునే చేయుచుండు. ఇతరులకు తనకుపనికిరానిదాని నొకప్పుడును నివ్వదట. ఎంతటి విలువగల వస్తువునైన, అదియితరులకు మంచిచేయునని తోచిన, దానిని మనఃపూర్తిగ నిచ్చివేయు. శ్రీవివేకానంద స్వామివారు మైసూరు సంస్థానమునకు పోయియుండినపుడు వారికిరాజుగారొక చందనపుకట్టెతోచేసిన నొకయపరూపమైన చేతికట్టెనిచ్చియుండిరి. శ్రీస్వామివారు హైదరాబా

మకు పోయియుండినపుడచ్చట నొకఫకీరు ప్రతిదినము వీరినికమభక్తితో సందర్శించి పోవుచుండెడివాడు. ఇట్లు కొన్నినాళ్లుగడచిన తరువాత వీరిహస్తము మీఁదుగ నేదైననొక ప్రసాదముఁబొంద నభీష్టమీఁ ఫకీరునికున్న దని వీరిమనస్సునకు దోఁచె. నీకు నాయొద్దనుండునదేమైన కావలెనా? ఇత్తునుండు' మనినిలిపి యొకనిమిషమిట్లాలో చించిరట. 'ఈతని కేమిత్తును? నాకున్నవానిలో నుత్తమమైనది ఈచేతికఱ్ఱయె. ఈఫకీరున కీకఱ్ఱనిచ్చితినా యితని మనస్సెంత యానందమునొందు! నాకక్కఱలేని వస్తువులనితరులకిచ్చిన నదియు యీవియగునె? కాదు కాదు, ఈవియన్న మనకున్న వానిలో ప్రశస్తమైన దానినే యితరుల కియ్యవలయు'నని యెంచి, మైసూరు మహారాజుగారు తమయందు గౌరవముంచి యిచ్చిన చందనపు చేతికఱ్ఱను తాము ఫకీరుని గౌరవించి వాని కిచ్చివేసిరి. అట్టివారికి శిష్యురాలైన నీమె మఱియొక భంగినడచునా?

చిత్రపటమునసీమె యాకారమును చూచిన నీమె ముఖమున శాంతిని, విశ్వాసమగ్రతను పరీక్షించు నేత్ర

ద్వయమును, సమస్త భూతములకును మనస్సంతాపముల వారించి, హృదయకందమునకు బలము నందజేసి ముఖపుష్పముల వికసింప జేయగల మందహాసమును, చూతుము. ఈమె మెడ నొక మాలికను ధరించియున్నది. అందుపై తన కుడిచేతినుంచికొని నిలిచియున్నది. మనదేశము నుద్ధరించుటకై యీమె గైకొనిన వివిధసేవా పద్ధతుల సూచించు మాలికయాయ ననై యున్నది. ఇట్టి యీయమ పటమును చూచుటయే మనమనంబులకు ప్రసన్నతను గలుగజేయు. ఇక్కాలమునకు నీయమయొక యవతారమని చెప్పవలసియున్నది.

ఈమె జన్మముమనకు యింతగ కొనియాడదగినదై యుంటకు కారణంబులు తెలిసియున్నవి. మనదేశమునకు సేవచేయుటయందీమె కపరిమితోత్సాహంబు. ఇట్టి యుత్సాహంబునకలిగించిన వివేకానందులకీమె మానససహోదరి. ఇంతియొకాక లోకంబునకంతటికిని జననిగాను సోదరిగాను వర్తించినది. తన్ను మనదేశమునకు సమర్పించుకొనిన, లోకసోదరీభావభరితయైన నివేదితాసోదరీమణియొక్క చరిత్రంబు మిక్కిలియు చదువదగినదై యున్నది.

# 1 అధ్యాయము.

## పూర్వజీవితము.

### జననము.

ఈయమ 1867సంవత్సరమున, అనగా ఇప్పటికి 47 సంవత్సరముల క్రిందట అక్టోబరునెల తే 28 దిన జనన మొందెను. ఈమె జీవితమంతయు, మనదేశమునకై వినియోగింపఁబడినదౌటచే, మనదేశకాల గణనాచారమునుబట్టి యీయమ జన్మదివసము మనయాచారముల తెలుగున చెప్పినశ్రీశకవర్షములు 1789 కి సరియగు ప్రభవసంవత్సర ఆశ్వయుజమాస బహుళపక్ష మందొకటియగును. హిందూదేశమునకపూర్వక్షేమంకరమార్గములఁజూపవచ్చియున్న ఈమెయీషష్ట్యబ్దచక్రమునకుఁ బ్రథమవర్షంబైన ప్రభవ సంవత్సరంబునజనన మొందుటెంతయుగమనింపఁదగియున్నది. ఆశ్వయుజబహుళపక్షముననే శ్రీకృష్ణుని భార్యయగు సత్యభామ నరకాసురునియుద్ధమున దునుమాడి పరిమార్చె. నివేదితయునీకాలమునమన దేశమునావరించియున్నమాఘ్యా సురుని మడియించుటకై యీమాసముననీపక్షముననే

జన్మించె. ఈసంవత్సరపుదీపావళి పండుగకు దేశమునం దంతటను గృహములలో దీపముల వరుసలనుమనదేశ స్త్రీలు సంతోషముతో వెలిగించినది, యీయమ జన్మ దివసమను సంతోషమువలననే యనినాడెరుగకున్నను ఇపుడు కొందఱెరుంగుదురు. మనదేశస్త్రీలవిషయమై యీమెను ముఖ్యశ్రద్ధ తీసికొనుచుండు వేళానందులుకోరె నంపిన నీమె యట్లైనడచుకొనినందున్నను నాడు మన స్త్రీలు వెలిగించిన దివియలు తమకు శ్రేయోదాయక మార్గములకుం గారణ భూతులాలయినయీయమజన్మ కారణంబుననేయనియెంచఁదగు. దీపముల జమురువేసి, ఒక్కొక దీపమును వెలిగించినపుడు గాలికది యల్లలాడి నిలుచునోనిలువదో యనుభయము నొక్కింతకలుగఁజేసి కొంతసేపటికి నిలిచి స్థిరముగావెలుంగసాగినంజూచి, మం దస్మితవంతములుగా నయ్యెడు వారిముఖములు నాడు జన్మమందిన నివేదిత మూలమున తమకిక ముందు గలుగఁబోవు శ్రేయస్సంపత్తిని సూచించు. ఈయమ పరిశ్రమలవలన గలుగఁబోవు స్త్రీజనోద్ధరణ తేజముల వెలుంగులునాడె వెలుంగ నారంభించె.

## తల్లితండ్రులు

ఈయమయొక్క తల్లితండ్రులిరువురును ఐర్లెండు దేశీయులు. ఇంగ్లెండ్, వేల్సు, స్కాట్లెండ్, ఐర్లెండ్ అనంబడు ప్రదేశములన్నియుం జేరి బ్రిటిషుద్వీపములను పేరంబరగుచున్నవి. ఇవి యూరపుఖండమునకు వాయవ్యభాగమున సముద్రమధ్యమున నున్నవి. వీటిలో మొదటిమూడును జేరియొక ద్వీపముగాను, ఐర్లెండు ద్వీపము మాత్రము వేరుగానున్నవి. ఐర్లెండు ద్వీపము తక్కినద్వీపములకు పడమటి వైపున సుమారు 20 మైళ్లదూరములో నున్నది. నైసర్గికాకారమున నివి యెట్లు రెండుభాగములై యున్నవో వానిస్థితినిగూడ నట్లె రెండువిధములై యున్నది. ఇంగ్లీషువారిచేత ఐర్లెండు దేశీయులైన ఐరిష్ వారు తక్కువగా చూడబడుచు న్నారు. ఐరిష్ వారియెడ కొంత యసూయమాపు స్వభావమును వారుకయు నింగ్లీషువారికి కలదు.

ఐరిష్ వారిట్టి వారై యున్నను వీరిలో ననేకులు గొప్ప వారుండిరి. ఇంగ్లీషు భాషలో వ్యాసరచన యందు వన్నెకెక్కిన స్విఫ్టు అనునతడు, గోల్డ్ స్మిత్తను నతడును

ఇన్గ్లాండ్ దేశీయుఁడె. ఇంక ననేకులు గొప్పవారలు ఇన్గ్లాండులో నుద్భవించిరి. నివేదితయు, తనజీవితమహిమ చేత నైర్లాండునకు ఖ్యాతి తెచ్చినది.

ఈయమ తండ్రి పేరు రెవరెండ్ యస్. ఆర్. నోబుల్. వీరివంశము నోబుల్ అనునది. 'నోబుల్' అనఁగా నింగ్లీషుభాషలో 'ఆర్య' యను నర్థము. ఈయన తనవంశము యొక్క పేరునకు దగినట్లు ఆర్య సమ్మతమైన వృత్తిని బడసియుండె. మాంచెస్టర్ పట్టణమున నొకధర్మబోధకుఁడై యుండె. ఇతఁడు విశేషముగ లోకులచే గౌరవింపఁబడుచుండెను. తనకూఁతురైన మార్గరెట్ నోబుల్ యెడఁ జాలగౌరవము నుంచియుండె. ఆబిడ్డయొక్క ప్రకాశించుముఖము సద్వర్తనము- బుద్ధి కుశలతయు నీయనకు, గాఢప్రీతిని మర్యాదను గలుగ జేసె. బిడ్డలయెడ ప్రీతిమర్యాదలతోఁ బెంచినఁ నాబిడ్డలు గొప్ప వారగుదురన్నారు. చిన్ననాటినుండియు చీటికి మాటికి వారినితిట్టియు, కారణంబులుండియు లేకయు వారిని రోజునకు పదిమారులు దబ్బడించియు, కనుభయముపెట్ట జాలక కట్టె భయముపెట్టఁబూని వారినికొన్నిరోజులలో

మొఁడికట్టెలుగాఁజేయుట నీతనియందులేదు. బిడ్డలకు కొంతబుద్ధివచ్చినది. మొదలు వారితో మితభాషులై వారిని మితభాషులఁజేయు. వారిని దూషింపక మర్యాదతోనాదరించి, మర్యాదాపేక్షకులుగాఁజేయు. దేనినైన నొకపనినిఁ బొరపాటు గాజేసిన 'బిడ్డానీవిట్లు చేయుదువని నేనెంచలేదు, ఇకనెప్పుడునిట్లుచేయకు'మని ప్రీతి పూర్వకవచనంబుల సరిపరచు. తానుబయటపోవు సమయమున బిడ్డలను తనవెంట బెట్టుకొని పోయి భూమియందును, వృక్షములయందును, మృగముల యందును, నాకాశమునందును, బుద్ధికి జ్ఞానము గరపు విషయములను మనసునకాహ్లాదము నిచ్చు విషయములను జూపుచు వారిబుద్ధుల కూర్థ్వదృష్టిని అల వాటు పరచు. మనము బయట పోవునపుడు, బాలురు వెంట వచ్చెదమందురు. ఏయుద్దేశ్యముతో మనలను వెంబడింతురు? తొలియుద్దేశ్యమేమన, మనయందు వారికనురాగము మెండవుటచే మనతోనుండుట వారికి బహుప్రియము. ఇంటమనవెంబడి తిరుగుచు మనము చెప్పెడి పనులజేయుచు మనమిచ్చువస్తువులనుగాని తిను ండములగాని, లేకచిన్నకథల పాత్రములగానిమిక్కిలి

సంతోషముతోఁ దీసికొనుచుందురు. మనమేవారికికావలసిన బంధువులును, పెద్దలును, స్నేహితులుననియీవనచర్యల మూలమున వారిని నమ్మింపఁజేయుచున్నాము. అట్టినమ్మకముకలుగఁజేసి, మనము వారిని బయటవెంటబెట్టుకొనిపోక వారిని చీవాట్లుపెట్టి 'ఛీ ! విధవా ! ఇంటఁబడియుండు' మన్న, పూయబోవుమొగ్గలవంటి వారికుతూహలముగల మనస్సులకు విసుకను చీడపురుగు నంటించుటయే. ఏయేప్రదేశములకు వారిని మనవెంటఁ గొని పోదగునో వాటికన్నిటికిని స్నేహితులఁబోలె తీసుకపోతగు. వారురాగూడని ప్రదేశములకు మనము పోవలసిన సమయముల వారికి తగుమైన కారణంబును దెలిపి యింట నెద్దియైన నొకపముంచిపనిని వారికిఁ గల్పించి, చిత్రముల వ్రాయుటయో, లేక పేరులు తెలుపబడని చిత్రముల వారిముందుపెట్టి ఆచిత్రముల సందర్భముల యూహింప మనుటయో, పొలములలోనికివెళ్లి,మట్టివి శేషములగమనించిచూచి, వానిని చిన్నచిన్న కాగితపు సంచులలో వేసికొని తెచ్చిపెట్టమనుటయో, సమీపమున నెద్దియైన నొకగుట్టకాని కొండకానియున్న, నచటికివెళ్లి, వివిధమైనరా

ళ్లను సేకరించికొనియు, వివిధమైన యడవికొయ్యలను ఆకులను, పుష్పములను, ముండ్లవిశేషములను జేర్చుకొని వచ్చియింట నుంచిపెట్టుకొనమనుటయో, యిట్టి యింపైనపనుల వారిని నియోగించిన వారెంత సంతోషముగ చేయుదురు? మనము వారిని మనయొద్ద చేరనివ్వక పాఱదోలిన నేమౌను? మనలనుజూచినదయ్యమునుగన్నట్లు. మనమింట నున్నంతసేపు, 'అయ్యో యీపాపి యింకను బైటపోలేదే. పోయిన నేనుపోయి నాస్నేహితులతోడ నాడుకొనవచ్చునే'యని బాలుఁడు కోరుచుండును. ఇట్టి సందర్భములే వానికి యాత్మగౌరవమును, ధైర్యబుద్ధిని గఱపక వారిని యసత్యవాదుల జేయు. 'ఎక్కడికిరా, పోయియుంటివి నేను వచ్చినప్పటికి యింటలేవు. విధవా 'యన్న' మాఅమ్మ బజారుకు పోయి వంకాయలు తెమ్మనిచెప్పినది. పోయియుంటిని' అనిఅబద్ధము చెప్పును. ఇంతసేపును ఈబాలుడు స్నేహితులతో చెట్లెక్కి టెంకాయలనో మామిడి పండ్లనో కోయుచుండిన వాఁడెకాని యంగడికి వెళ్లి వంకాయలు తేఁబోయిన వాఁడుకాఁడు. "పిన్నలను మనము గౌరవించిన వారునుతమ్ము గౌరవించుకొను

దురు!" అను నీయభిప్రాయముల దృఢము గలవాఁడై; యస్. ఆర్. నోబ్‌ల్ మిశ్రుఁడు తనకూతురైన మార్గరెట్ నోబ్‌ల్‌ను, కడుగౌరవముతోఁ జూచుచుండెను. ఆమెయొక్క బుద్ధిబలంబునకు, మనస్తత్వమునకును మెంతుగ మెప్పుచూపినవాఁడై యుండె.

చదువు.

మార్గరెట్ ఇక్కాలపు చదువున బాగుగ తీరియుండె. ఇందుకు సహాయముగా తనతండ్రియొక్క సజ్జీవనము ఈమె హృదయకలశమును కరుణారసముతో నింపించె. ఈమె చిన్నవయస్సున మాంచెస్టర్ పట్టణమున బీద జనులకై ఈమెతండ్రి చాలకష్టపడు చుండెడివాఁడు. ఈయనచర్యలను గమనించిన ఈయమకును ఇట్టిగుణములు పట్టుబడినవి.

జ్ఞానతేజస్సు

ఈమెయొక్క చిన్నముద్దు ముఖమునుచూచినపుడంతయు,తండ్రికి నొకవిధమైన తేజస్సుకానవచ్చుచుండె. తేజోవంతమైన ఈమెముఖమును చూచినపు డాయన కొంత యో [illegible] నెంతభక్తిభావమంకురించునో నంత

టిభక్తియు గౌరవమును కలుగుచుండె. ఒకనాడుమా ర్గరెట్టును జూచుటకై యామెతండ్రిగారి స్నేహితుడొ కఁడు వచ్చియుండె. ఈస్నేహితుడు కైస్తవధర్మబో ధకుడు. వారు మాటాడుచుండు సమయమున మార్గ రెట్టును వచ్చియుండె. ఆస్నేహితుడు అబిడయొక్క ముఖతేజస్సున కాశ్చర్యపడి, తత్త్వవిషయమై వీరిరు వురకు జరిగిన సంభాషణ నామె గమనించి వినుటను జూచి మెచ్చుకొని 'హిందూదేశము కాలక్రమమున నీమెను రప్పించుకొనును' అని దీవించె. ఈయనయట్లు చెప్పి పోవుట యాగామి సూచకమయ్యె. ఈమెతండ్రి యస్. ఆర్. నోబల్ పూజ్యుడు తన మరణకాలము సమీ పించుటనెఱింగి, తనభార్యను బిలిచి 'కొంతకాలమునకు మార్గరెట్టొక గొప్పకార్యమును బూనుకొనవలసియుం డును. అట్టిసమయమున నీవామెకు సహాయురాలవై యుండవలె' నని తనకోర్కె నెఱింగించెనట. ఆసమ యము సమీపించి నపుడు కూతునెడబాయుట తల్లికి ప్రాణసంకటమయ్యె. మనస్సు శిథిలమై ధైర్యమును స్థైర్యమును గోలుపోయె. కూతురు తన్నువదలి పది

వేల మైళ్ళదూరమున నున్నదేశమునకుఁ జని యచ్చట నే యావజ్జీవము గడపవలెనను చింతయే యీమెకు చేదుగానుండె. చేదైనను వేపాకునునూరి పథ్యమని మనము మ్రింగుటలేదా? చనిపోయిన తనపెనిమిటి యొక్క యభీష్టమును నెరవేర్పకుండుటకును మనస్సు రాదాయె. తుదకు బుద్ధిస్థైర్యముంగొని తనకూతురు తన్నువదలి హిందూదేశమునకు కూతురవుట కియ్యకొనియె. ఇయ్యకొనుటయెగాక తానును నప్పటినుండి హిందూదేశమును దల్లియని యెంచసాగె.

## ఇంగ్లాండునకు సేవ.

మనదేశమునకు వచ్చుటకు బూర్వమే యీమె ఇంగ్లాండున లండనుపట్టణమున విద్యాదాన పవిత్ర మనతిగా పేరుబొందియుండె. విద్యాదానమున నంతకు పూర్వము నెగడియున్న పద్ధతులు సరియైనవి కావని యెంచి, ఫ్రీబెల్ అనునతనును పెస్టలోజి యనునతనును క్రొత్తపద్ధతుల కనిపెట్టి ప్రచురపరచియుండిరి. వారి యభిప్రాయములతో నీమెయు నేకీభవించి, వారిపద్ధతులు ప్రశస్తములని యెంచి, తానువాని ననలంబించు

చుండె. వీనిని నిరాటంకముగా నవలంబింపఁగలిగి యుం టకై, వింబల్డన్ అనుప్రదేశమున తానొకపాఠశాలను స్వయముగా బెట్టి నడుపుచుండె. దీని కీమెయె ప్రధానోపాధ్యాయురాలు.

ప్రసిద్ధిగాంచిన "సిసేమ్" క్లబ్ అను సమాజమును స్థాపించినవారిలోనీయమముఖ్యురాలు. ఈయమయొక్క బుద్ధిబలంబును ఇంగ్లండులోని తత్త్వదర్శకులలో పేరుఁ బొందిన హక్స్లీ దొరకూడ మెచ్చుకొనియె. ఈమె యొక్క బుద్ధిబలవిశేషంబున నిఁగ్లండు దేశమునసేఈ మెకు గొప్పపదవియు గౌరవమును సాధ్యంబులై యుండి నవి. వానిని బొందబోనున్న సమయమున నేహిందూదేశము యొక్కయార్తస్వరము లామెచెవిసోకి, దయానిధియైన నామెను అయస్కాంతమును పతునుకంబోలె లాగుకొనినవి.

## పూర్వమనస్స్వభావము.

ఈకాలమప్పటికి గొప్పబుద్ధిబలము, దయాళుత్వము జనసేవారతి, ఇత్యాది మహద్గుణసంపత్తి యీమెను బొందియున్నను తత్త్వవిషయమున యుక్తియే జ్ఞానార్జనకు ముఖ్యాధారమని యెంచియుండె. యుక్తికెద్దిసరి

యని తోఁచదో అదియవాస్తవమనియు,అవిశ్వసనీయమ నియు నెంచుచుండె. శ్రీరామకృష్ణ పరమహంసులవారి బోధనాఫలముల జెందుటకుముందు వివేకానందులు కూడ నాస్తికవాదులై యుండిరి. అట్లే వివేకానందుల బోధనలకు పూర్వము యీామెయుఁ యుక్తివాది (Rationalist.) నియైయుండె. ఈవిషయమున నీమె తనగురువులైన వివేకానందుల బోధనవాక్యముల వలనను, వారిజీవితమహిమ పరిశీలన పరిచయములవల నను, తనయభిప్రాయమును మార్చుకొనవలసియుండె. ఇంగ్లాండులో నున్నంత కాలము నీమె యుక్తివాది నిగానే యుండె.

### కరుణానిధిత్వము.

ఈయమయొక్క యపార దయాళుత్వమును గు రించి కొంతచెప్పవలసియున్నది. లండన్‌పట్టణమున నీమెగనిన జనుల దుఃఖస్థితి యీామెమనసునుగరిగించు. ఆకష్టముల జూచినపుడంతయు నదిఈమెకు ప్రపంచము నంతటనుండు జనుల కష్టస్థితియొక్క ప్రతిబింబముగాఁ దోఁచు. అచ్చటికష్టమును జూచినపుడు కష్టములమును

గుచున్న జనలోకమంతయుతమమస్థితికై మొఱ్ఱోయని యేడ్చి యాదుస్థితిని బాపుమని తనతో మొఱబెట్టు కొన్నట్లు ఆమెకుదోచు. ఈయమను కరుణానిధియన్న నది యొకింతయు నబద్ధముకానేరదు.

భూదేవియొక్క మొఱ.

మనగ్రంథములందు లోకమున ధర్మవృత్తి యడు గంటి జనులకు కష్టస్థితి వాటిల్లినపుడంతయు భూదేవి విశ్వేశ్వరుడైన విష్ణువునుజేరి తనదు స్థితిని బాపుమని కేలుమోడ్చి ప్రార్థించునట్లు వ్రాసియున్నారు. భూమి యొక్క దేవియనునది నిజమో, కాదో, విష్ణువుండుట నిజమోకాదో, ఆయన నీదేవి నోటిమాటల ప్రార్థించియుంట వాస్తవమో కాదో, యీవిషయ ముల నటుంచెదము. శుద్ధమానసులకును, ఉన్నత ఆత్మ వంతులకును, సామాన్యజనంబులకుఁజేతనహీన ములై తోచెడి విశ్వాంశములు సచేతనములైనట్లును, మనుష్యుల వలెనే మాటాడ శక్తిగలిగి తమతో మాటాడినట్లునుతోచు. కవుల కిట్లె ప్రకృతియంతయు సచేతనముగాఁదోచు. అట్లే యీయమకును దుఃఖ

భాజనమైన లోకమంతయు తన దుఃఖమును చెప్పి కొని యేడ్చినట్లు యీమెమనస్సునకు దోచుచుండెను. ఈయమగారు సామాన్యురాలా ?

బుద్ధుడు.

బుద్ధునితండ్రి లోకములోని కష్టములనొకదానినైనను నతనికంటబడనివ్వక యుండుటకు బ్రయత్నముల నెన్నిటినో జేసె. బుద్ధుని విషయమైజాతకము జూచి జ్యోతిష్కులతడు లోకోత్కృష్టుడవునని చెప్పియుండిరి. అయిన సమస్తభువనములనేలు చక్రవర్తియవు, లేక, దేవసమానుడైనవాడైన నవునని చెప్పియుండిరి. కుమారుడు సన్యాసియగుట తండ్రికిష్టముగా నుండదుకదా? కనుక బుద్ధుడు సన్యాసియవునేమోయను భయముచేత జాలపీడితుడై యతనితండ్రియతనికి దుఃఖము యొక్కయు కష్టముయొక్కయు పొడలను గూడ చూపకుండుట కెన్నియో ప్రయత్నములు జేయుచుండెనట. వాడిన పుష్పములుగూడ నతనికంట పడనిచ్చువాడు కాడట.

ఒకనాఁడు బుద్ధుఁడు పట్టణమును జూడఁబోవనున్న తనకోరికను తండ్రికి తెలియఁజేసె. ఆయూరేగింపునకు రాజొకదినము నిర్ణయించె. ఆనాఁడు మార్గములందంతటను నీరుచల్లించి, యింటింటి వాకిట పసుపుకుంకుమలును, ముగ్గులును పెట్టి, పచ్చతోరణములను కట్టియుంచవలసినదిగా నుత్తరువుపంపె. సమస్తమును మనస్సునకాహ్లాదకరముగా నుండవలయునేగాని మనోవ్యాకులతను కల్గించునట్లుండకూడదని యాజ్ఞనిచ్చె.

ఇట్టియేర్పాటు లన్నిటిఁజేసి రాజొకనాటి సాయంకాల సమయమున బుద్ధుని, అతని ప్రాణస్నేహితుని, జతచేసి రథమునెక్కించి పురదర్శనమునకు వారినినంపె. రాజవీధులలో నొకదానిని సారథము పోవుచున్న సమయమున నొకముసలివాఁడు గూనుచేవంగి చేత కఱ్ఱనూనుకొని వీధికడ్డముగా నడచిపోయె. దీనిని గౌతముఁడుకనె. ఇంతకుముందొకప్పుడును గౌతముఁడు ముదుకలను చూచినవాఁడుకాఁడు. వార్ధక్యదశ యెట్టిదైనది దానికష్టములెట్టివైనవి ఇతఁడుచూచినవాఁడుకాఁడు. ఆదృష్టిగౌతమునిమనస్సున కాశ్చర్యముపుట్టించె. దానిం

గూర్చి విచారించి, మనుష్యులు కాలముజరుగుకొలఁది యీస్థితికి రావలసియున్నదనియెఱింగిన వెంటనే, మానవ జన్మమతిదుఃఖ యుతమనియెంచి, సన్యాసోన్ముఖుడయ్యె. ఒక వృద్ధుని యాపూర్వదృష్టియే యింత యొనర్చె. వానిఁగనుటయే నీతనిమనసును చింతచిచ్చుపాలు జేసె. మంచిమనుష్యునకొకమాట మంచిపశువునకొకదెబ్బ యనినట్లు, మహనీయులకు కష్టపడువారియొక్క యొక్కరిదర్శనమైనను సంభవించినవారి మనస్సుకరగిపోవు. మార్గరెట్టును, నక్లేలండను పట్టణపు జనులదుస్థితి మూలమున లోకము నందంతటను నున్నకష్టము మనస్సునకు దెచ్చుకొని, చింతగొని, దాని బాపుమార్గంబులవెదుకఁ బూనుచుండె.

ఇట్టి స్వభావముగల ఈయమయొక్క పరిశ్రమలకు ఇంగ్లండులో కావలసినంత యావశ్యకతయు, నెడము నుండెనవి. అయినను నీమెయొక్క శక్తిసంపదలు మనదేశమునకు లభించుట మనయొక్కయు మనదేశముయొక్కయు సుకృతమని యెంచఁదగు.

ఇట్టి మహనీయయొక్క సహాయసంపత్తిని మనదేశమునకు గలుగజేసిన ఖ్యాతి శ్రీ వివేకానందస్వామివారిదే. వారిరువురి సమాగమము కనుఁగోద్యము.

## రెండవ అధ్యాయము.

### గురుశిష్య సమాగమము.

### ఇంగ్లండులో వివేకానందులు.

క్రీ. శ. 1895 సం॥ సెప్టెంబరు నెలలో అనేకులయాహ్వానముల నాదరించి శ్రీ వివేకానందు లింగ్లండు దేశమునకుఁ బోయిరి. ఆకాలమున వీరి యుపన్యాసముల శ్రద్ధతోవిని వీరియందు గౌరవవంతులైన ఆంతర్యపరిచితులు కొందరుండిరి. వారిలో మార్గరెట్ నోబిల్ కూడ నొకతెయైయుండె.

వివేకానందుల యుపన్యాసముల నతిశ్రద్ధతో మార్గరెట్ వినెగాని వానికి సులభముగా లోఁబడినదికాదు. బుద్ధిమంతు లితరుల యొక్క అభిప్రాయములకు లోనై తమమతములను పారదోలరు. విపరీతాభిప్రాయములు గలవారెంత గొప్పవారైనను వారియభిప్రాయములు తమయుక్తికి సమ్మతమైనవిగాకుండినయెడ గొప్పవారను కారణమాత్రముననే తమయభిప్రాయముల మార్చుకొననేరరు.

## మనస్థైర్యము.

ఎవఁడేని యొకవాచాలుఁడు వచ్చి వేనవేలు జనుల సభలఁగూర్చి, మనసుల కింపుగా మాటాడినంతటనే వానియభిప్రాయములను లోనొాచున్నాము. తరువాత నొక వారముదినములవఱ కతనినామము నేస్మరించుచు నతని పద్ధతులనే యాలోచించవలెనని చెప్పకొనుచుందుము. ఇతనియభిప్రాయము లక్కాలమునకు యుక్తాయుక్తములని యెంతుము. తరువాత కొంతకాలమునకు మఱియొకఁడు వచ్చి తన యసమానశక్తితో మొదటివాని యభిప్రాయములకు విపరీతములైన యభిప్రాయముల నిచ్చిన, ఆకాలమున కతనిని మెచ్చుకొని 'ఈయభిప్రాయములేసరి. అతఁడు చెప్పిన సంగతులలో గొంత నిశ్చయమున్నను, నతనిపద్ధతులంత సరియైనవి కావు. ఇతఁడు చెప్పినవేసరి' యనియెంతుము. నేఁడొక సంఘసంస్కరణవాది వచ్చి స్త్రీపునర్వివాహముశాస్త్రీయమనియు, పండితమండలాగ్రగణ్యులుగ నెన్నదగు ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, విష్ణుశాస్త్రి, రామకృష్ణ గోపాల భండార్కరు, పండిత రామావతారశర్మ ము

స్నగుమహనీయు లట్టివివాహములుప్రాచీనార్యధర్మము లకువిరుద్ధములుగావని సప్రమాణముగఁబుజువుపరచియు న్నారనియు, బ్రహ్మచర్యము స్త్రీపురుషు లిరువురకును ఉత్తమధర్మమని యొప్పుకొనదగినదైనను బలవంతము గా బ్రహ్మచర్య మవలంబింపుమని నిర్బంధించుట న్యా యము కాదనియు, అరువదేండ్ల వృద్ధునకు సైతము పునర్వివాహమున కనుజ్ఞయిచ్చి ఆరేండ్లప్రాయపు బా లవితంతువున కైనను పునర్వివాహ మశాస్త్రీయ మ క్రమమని శాసించుశాస్త్రమును వాదించువాదమును నాగరిక ప్రపంచము మెచ్చజాలదనియు, స్త్రీలవిష యమై మాత్రము క్రూరశాసనముల ఆరణాచలో పెట్టి పురుషుల కక్రమ స్వాతంత్ర్యముల నిచ్చుచెన్నటికిని ఆర్యధర్మముగానేరదనియు, స్త్రీపునర్వివాహమువలన వ్యభిచారము, శిశుహత్య భ్రూణహత్య మొదలగుదుష్కా ర్యములుతగ్గుననియు, ఇట్టి కారణములను పెక్కింటిని పేర్కొనిన, వానివాదమునుహర్షించి 'ఔను. వీరుచెప్పి నదిసయుక్తికముగ సప్రమాణముగనేయున్న'దందుము. రేపుమఱికొకడువచ్చి' విధవలకే వివాహములు చేయు చున్ననెట్లగు ? మనదేశమున స్త్రీజనసంఖ్యయే ఎక్కువ

స్థైయుండ ఒక్కొక్క స్త్రీకి రెండువివాహములుచేసిన తొలివివాహము కాకుండకూడ ననేకస్త్రీలు పోదురు గదా ? .ఇదియెట్టిన్యాయము. ఇదియుఁగాక మనయార్యధర్మమే మనజనులెల్లపుడును సుఖాపేక్షకులై యుండునట్లుగా జేయుటెంతయు చెడుగు అనికదా? క్రైస్తవ 'నరులాహారము వలననే జీవించుటలేదు' అనిచెప్పియున్నట్లు, నరులైహిక సుఖంబులనే అపేక్షించుచుండ గూడదు. స్త్రీకిగాని పురుషునికిగాని వివాహచింతయే జీవితచింతగా నుంచుకొనగూడదు. వివాహమనిన, సంసారము; సంసారమనిన స్వకార్య దురంధరత్వము, పరలాభహాని కరణమును గదా ? ఈసామాన్యచింతలను మాన్పించి, బ్రహ్మచర్యము, స్వలాభానపేక్షయు పరక్షేమకారియగుబుద్ధిని వారికిఁ గల్పించి వారిని దేవసమానులుగ జేయుటకు బ్రయత్నపడవలెను' అనిచెప్పిన వానిమాటల నామోదింతును:. 'మనదేశపు గ్రంథములన్నియు, ప్రాతకాలమునాటివి. ఇక్కాలంబునకుఁ గావలసిన వ్యాపార పద్ధతులగురించియు, పరిశ్రమ పద్ధతుల వృద్ధిపరచుకొను మార్గములగురించియుఁ జెప్పినవికావు. అడవికి బొమ్మనియు,

ముక్కుపట్టుకొని యూపిరి బిగించి దైవముఁ బ్రత్యక్షముచేసికొమ్మనియు, చెప్పుచున్నవి. ఇవియీకాలమున కుపయోగములైన మార్గములుకావు. కావున నీగ్రంథములును నిరుపయోగములు. వానిని మనము చదువుట, కాలమును వృథావ్యయపుచ్చుట. మన బాలురకును వానినినేర్పించుట యనుచితము. యూరోపియనులు యేగ్రంథముల చదివి యేమార్గముల నవలంబించి యీస్థితికి వచ్చియున్నారో ఆపద్ధతులనే మన బాలురకుఁ గఱపి, ఆగ్రంథములనే వారిచేత జదివింపవలె" నని చెప్పిన, 'అవును అట్లనేచేయుటమంచిది' అనియందుము. కొంతకాలమునకు మరియొకరువచ్చి "పాశ్చాత్య గ్రంథములయందు విశేషములున్నను, వానినిచదివి వారిపద్ధతుల నవలంబించిన కొంతకాలమునకు మన పూర్వస్థితియే మారిపోవు; మనము హిందువులనుటకుఁ దగిన చిహ్నములే కొన్ని సంవత్సరములకు మఱగిపోవు. మనమప్పటికి హిందువులమా లేక హిందూదేశపు ఐరోపియనులమా యను సందేహముకలుగును. ఇది యాత్మనాశనము. ఇట్టి పనినిచేయ బూనఁగూడదు. జ్ఞానమును సంపాదించు కొనుటకు స్వదేశభాషయే,

సులభమార్గము. ఇతర దేశీయుల భాషలలో నమూల్యమైన గ్రంథములుండినచో వాటిని మనభాషలలోనికి తర్జుమాచేసుకొని చదువవలెనేకాని క్రొత్త భాషను నేర్చుకొనుటకై కొంతకాలము వ్యయపఱచుట కేవలము తెలివి హీనత' యనిన, 'ఔను మనభాషనే మన బాలురకు శాలలలో ప్రథమభాషగాఁ బెట్టి యితరదేశ వ్యవహారములను, చరిత్రలను తెలుసుకొనుటకు ఇంగ్లీషు భాషను రెండవభాషగా బెట్టుకొన వలెనని యందుము. సామాన్యజనుల మనంబులు ఓడచాపల వంటివి. గాలివెటుపోదిన నటుతిరుగును. కాని గొప్పవారి మనంబులు స్థిరంబులు. అట్టివారిమనంబుల కింకొక స్వభావమును గలదు. భిన్నాభిప్రాయములెడ వీరికిమత్సరముకాని ఈర్ష్యకాని యొకింతయునుండదు. అభిప్రాయ బేధములున్నను వీరికి పరస్పరగౌరవములు మెండై యుండు. మిక్కిలియు గొప్పవారికి, తమయభిప్రాయములకు విరుద్ధమైన యభిప్రాయముగల వారి యెడ నాకారణముననే గౌరవము హెచ్చియుండు. నివేదితకును వివేకానందులకును సమాగమమొకలిగిన తరువాత రెండు సంవత్సరముల వఱకు అభిప్రాయ

నైరుధ్యముండినది. ఆయనగారి బోధనలకు తటాలున నియ్యకొనక, తనస్వంతయభిప్రాయములనే గౌరవించి నిలుపుకొన్నందుకు నివేదితపై వారికి గౌరవమధికమై యుండెను.

వివేకానందుల ప్రథమ దర్శనము.

తొలితొలుత వివేకానందుల దర్శనమే యీమెకు వివిధాభిప్రాయములఁ బుట్టించెను. సభామధ్యమున పద్మాసనమున కాషాయమును ధరించియున్న యట్టి విగ్రహమే ఈమెకంటికి క్రొత్తదై యుండెను. ఈ యువపురుషుడు, యీమూసనము పాశ్చాత్యులకు నూతనము. ఆయనముఖమున తేజము విశేషముగ వెలుంగుచుండెను. అయన విశాల నేత్రములు దీర్ఘదృష్టిని విశేషమైన యాంతర్దృష్టిని జూడచూపు. ఆనేత్రద్వయముయొక్క నిర్మలపు చూపులను గన్నవారికి వాటిని మరువ నశక్యము. ఈనూతన్నతకుఁదోడు యీయన నుడువులు నెద్దియో యొక నూతన విషయమును గూర్చి ప్రసంగించుచుండినవి. ఉపన్యాస పద్ధతి యెట్లామెకు క్రొత్తగానుండెనో, యుపన్యాస విషయమును నట్లే యపూర్వమై

యుండెను. యుక్తికిగోచరమైన విషయముల గురిం చియే యీామె, చదివి, విని, చింతనచేసి వ్రాసియు, నమ్మియుండె. వీరియుపన్యాసమున ఆత్మవిషయ మును ఆత్మకుగోచరమైన విషయములె ప్రధానములై యుండెడివి. ఈయన మాట్లాడుచుండెనో లేక, చిత్త భ్రమను ప్రేలుచుండెనో, యను సందేహముకూడ కలుగదగినదై యుండె. అట్టి సందర్భమున వారి బోధ నలయెడ, యీామెకు విశేష గౌరవము పుట్టినదికాదు. అయిన నీయనయొక్క యుచ్చారణ పటుత్వముచేతను దృష్టిప్రభలచేతను యెల్లప్పుడును ఈమె యుపన్యాస ముల యందు నమ్మికయుంచకున్నను యపారగౌరవ మునుంచె. వీరియుపన్యాసములయం దీమెకుదొల్త మొంతనమ్మిక యుండెడిదని యీాక్రింది వచనములవలన తెలుసుకొననగు: "ఈయనతత్త్వబోధనలునాకు సందే హమును బుట్టించుచున్నయవి. మత విషయమున నీయన పద్ధతులనవలంబించితిమా కొంతకాలమునకు వాటిలోని లోపములను కని, యీబోధనలను మిం చిన యభిప్రాయముల తెలుసుకొందుము. దీర్ఘాలోచ నకును యుక్తికిని నివి సమ్మతములుకావు. వీటిసంగ

కరించుటయుక్తము’ అనియెంచియుండె. అట్టియన్నను యుపన్యాసములను వినుటమానినదికాదు. వాటికై శ్రద్ధతో తగినయేర్పాట్లు చేయుటకును వెనుదీసినది కాదు. ఈసమయమున నీయన, తిమితిమింగిలాదుల చేత నసమ్మతమై రత్నములచేత యాదరింపఁదగినసము ద్రమువలె తనసచ్చరిత్రముచేతను వాక్పటుత్వముచేతను నీమెకు గౌరవనీయుడై తనయభిప్రాయ వైరుధ్యముచేత నసమ్మతుఁడునై యుండె.

కొంతకాలమిట్లుసాగె. తుదకీయన ఇంగ్లాండును వదలి పోవునప్పటికి వీరిరువురకున్న యభిప్రాయ బేధములుకొంతవరకు బాసిపోయి ఈయననీమె ‘గురువుగా’ భావింపసాగె. దీనికి కారణంబు లెవ్వియనగా, ఈయన యుదాత్తతయు, ప్రాణమునకెక్కుడుగ నెంచిన తన దేశజనులయందలి ప్రీతియు, నీమెను మెప్పించినవి. ఈయన యందలి యీగుణసంపదకు నీమె వందన మాచరించినట్లు చెప్పియున్నది. అన్నిటికన్న నీయన యొక్క నిష్కళంకసద్వర్తనయే ఈమె నాయనకు భక్తురాలిగ జేసె.

మరికొంతకాలము జరిగి పరిచయమును మానసిక సేవయు వృద్ధిజెంది మైత్రియు భక్తియుజనింప, నిందుల ఫలముగా నీయన బుద్ధిశక్తిని నీమెయెఱుంగగలిగె. దానిని సమగ్రముగ నెఱింగినమీదట "వీరిబుద్ధి యాశ్చర్య మమేయము, నాకు తెలిసిన మఱియెవ్వరియందు నిట్టి ప్రజ్ఞను ప్రతిభను నేనుగన్నదిలేదు. వీరిబుద్ధికిని నితరుల బుద్ధికిని సామ్యమేలేదు. ఈతారతమ్యము మొదట నేనెఱుంగనైతి." ననియామెచెప్పెను.

1896-వ సంవత్సరమున వివేకానందులింగ్లాండునకు తిరిగిపోయియుండిరి. అప్పటికి మార్గరెట్‌కు వీరితో మైత్రి గలిగి యొక సంవత్సరమైనది. ఈయన బోధించిన తత్త్వవిషయములలోని లోపముల గుఱించి యాలోచించుటకు 360 దివసములుండినవి. అయినను నీమెయొక్క యభిప్రాయములు వీరియభిప్రాయములతో పూర్తిగా నైకమత్యము జెందలేదు. అయిన నొక్కబేధము కలిగియుండినది. వీరుతోలుత వచ్చిపోయినపుడు వీరి యభిప్రాయములు పొరబాటని ఆమె యెంచియుండినది. అయిన నీసంవత్సర కాలపు చింతన ఫలముగానవి పొరబాటులను రూఢి యభిప్రా

యమునువదలి సందేహావతియయ్యె. వాటిలో కొంతకు కొంత నిజముండవలెనని యెంచవొడగె. వీరుతిరుగ నింగ్లాండునకు పోవునప్పటి కీమె వాటి నిజమును గుఱించి తొక్కటు పడుచుండె. అభిప్రాయ విరోధము తగ్గినది. కాని యభిప్రాయ మైత్రియు నైకమత్యము నింకను పొడచూపనుగూడలేదు.

## ఆహ్వానము.

అభిప్రాయభేదములిట్లున్నను వివేకానందులీమెను తమ శిష్యావతంసముగా నెంచుచుండిరి. "ఒకనాడు మాటలసందర్భమున, నున్నట్టుండి స్వాములవారునా నై పుతిరిగి 'మాదేశపుస్త్రీలవిషమై, నే కొన్నియుపాయములందలపెట్టియున్నాను' అనె. ఈమాటలవిన్నం తనే నాజన్మము మార్చుతగిన సందర్భము సమీపించి నట్లునామనసునకుదోచె." నని వ్రాసియున్నది 'కొన్ని రోజులుగడచినతరువాత యొకనాడునన్ను హిందూదేశమునకు గొనిపోయిన నాస్నేహితురాలి యింట నేనును, స్వాములవారును అతిథులుగానున్న సమయమున, హిందూదేశ స్త్రీలకై స్వామివారి యభీష్టము ప్రకారము నేనుపాటుపడనొప్పుకొంటి ననుసంగతివారికె

నాస్నేహితురాలు తెలియజేసె." ఈవిధముగ తాను వివేకానందులయెడ గౌరవముంచి, హిందూమాతకు నివేద్యము గావించుకొని, 1898 సంవత్సరముయొక్క ప్రథమ భాగమున హిందూదేశమునకు పయనమై కొనెను.

స హ చా ర ము.

హిందూదేశమునకు వచ్చినతరువాత గురువున కునుశిష్యురాలికిని మతభేదములింకను యుంటుండినవి. కానిపరస్పరభక్తి గౌ ర వ ము లు వర్ధిల్లుచుండినవి. 1898-వ సంవత్సరమంతయు స్వాములు హిందూదేశము నంతటను సంచారములసల్పెను. ఈ సంచారముల నీమెయు వీరివెంటబోవుచుండె. అశోకుని తమ్ముడును చెల్లెలును మగధనుంచి సింహళదేశమునకు బౌద్ధ మత మును స్థాపింపబోయినట్లు వీరిరువురును హిందూదేశ మందలి నెల్లప్రదేశములకుజని వేదాంతజ్ఞానమును వెద జల్లుచుండిరి. ఈసంవత్సర పర్యంతపు సహవాసము చేతను సహచారముచేతను స్వాములగురించి యీమె యెఱింగిన దానినంతయు నీక్రింది రెండుమూడు వాక్యము

లలో నిమిడ్చి వ్రాసియున్నది. "ఈసంవత్సరమున ప్రతిరోజును నా కతిసుదినముగా గడచినది. ఇంతకు బూర్వము నామనోగోచరమైనదంతయు నాకిప్పుడను భవమునకునచ్చినది. కేవలము మానసిక మంతన ములుగా నుండినవన్నియు చరిత్రాంశములుగా జీవితాంశములుగా నైనవి. ఒక్కొక్క తరుణమును ఆత్మోద్ధారకముగానుండె. ఈసంవత్సరపు మనోను భవములు జన్మజన్మములకును స్ఫూర్తినిచ్చుచుండె. మహాదుక్తులువీరి నోరువెడలి నామనంబునంటి నాకు మహాచ్ఛక్తి నిచ్చినవి. ఒకప్పుడు సమాధి యనుభవ బ్రహ్మానందముకూడ లీలగా గోచరమయ్యె."

## ఐకమత్యము.

వివేకానందుల యుపదేశములన్నిటిని తనస్వకీయ పరిశీలనచే సత్యవంతములని యెరుగునందాక వారిపద్ధతులకన్నిటికిని మార్గరెట్ తోడ్పడినది. కాలక్రమేణ స్వానుభవ ఫలంబున వీరియభిప్రాయంబులయందీయమ నిశ్శంకమైనైకమత్యముంగనె. వీరియందుగాఢమైన భక్తి యుదయించి వర్ధిల్లసాగె.

వీరిరువురకు నభిప్రాయైకమత్యము కలుగుటకు ముందు కొన్నిసమయముల హిందూ దేశమునకువచ్చి తానుపాటుపడు నుద్దేశ్యమునుగూడఁ మానుకొన బూనె. మాటనిచ్చిన కారణంబున నొకవేళ నీమె మన దేశమునకు వచ్చి మనస్త్రీలకై పాటుపడినను స్వాములకును నీయమకును మైత్రియంతగానుండియుం డదు. వీరిరువురకును నీయొడంబడికను కుదిర్చిన యామెనోబ్ల్‌కు ముఖ్యమిత్రమైయుండె. ఆమె యీ సందర్భమును గమనించి వాగ్దానమును కొనసాగించు భారమును నోబ్ల్‌పై మోపి, ధర్మ బలత్కారమున నిచ్ఛలేనిపనికి ప్రొయోగించిన నామెకు చాలహాని కలుగు నేమోయనిభీతిఁజెందె. అందువలన ఆత్మానుభూతియు యుత్సాహమును లేక ఒకరికై యొకపనిని ధర్మాభి లాషిణియై ఈమెచేకొనినను దానినిసెరవేర్చుట ఈమెకు గొప్ప వ్యధయగునని శంకించి, భీతియుఁజెందె. ఈ పూనికచేత నివేదితకొకవేళ చేటువాటిల్లినను వాటిల్ల వచ్చునని గొప్పభయము పుట్టె. ఆకారణంబున స్వాములఁవారితో నీవిషయమై తానే నివేదిత తరపున

మాటాడి నివేదితను హిందూదేశమున తనమనసుకు రాని ఈకష్టమునకు పాలుచేయ వలదనిన్ని ఆమెను మన్నింపమనిన్ని వారిని వేడుకొననుద్యుక్తయయ్యె. భయభక్తులతో వారింజేరి యీవిషయమును నామెవారి కెఱింగించె.

ఆశీర్వాదము.

ఆనాడు స్వాములు మారాడక వెళ్లిపోయిరి. నాటిసాయంకాలమె వారుతిరిగివచ్చిరి. వచ్చునప్పటికి 'నేనును నాస్నేహితురాలును యింటి వసారాలో నిలుచుకొని దేనినోగుఱించి మాటాడుచుంటిమి. ఈ సమయమున నేమియునెఱుంగని ముద్దుబాలునివంటి నిశ్శంక ముఖముతో మావద్దకువచ్చి నాస్నేహితురాలింజూచి' నీవుచెప్పినదెసరియె. ఇంకనుగొంత మార వలసియున్నది. నేనడవులకువెళ్లి ఏకాంతముంజెందెద. తిరిగివచ్చునపుడు శాంతిదేవిని వెంటబెట్టుకొనివచ్చెద' నని చెప్పినిలిపె. తనముఖము నటత్రిప్పుకొనియె. త్రిప్పుకొనునప్పటికి తనకండ్లకుసమానమయిన ప్రకాశ ముంగలిగిన ప్రతిపచ్చంద్రుడు రేఖామాత్రుడై యాకా శమునవెలుంగుచుండె. దానింజూచినవెంటనే స్వాము

లనేత్రములు స్ఫురించి, రెండింతలై తిరిగి మూసికొని తిరిగి తటాలున తెరచుకొనినవి. ఆసమయమున వీరెస్వరమున పటుత్వముప్పొంగుచుండ 'చూడుడు. మహమ్మదీయులు ప్రతిపచ్చంద్రుని విశేషముగ గౌరవింతురు. మనమును నీసూక్ష్మచంద్రునితోటి సూక్ష్మజీవితమును బడయుదము' అనిచెప్పెనిలిపె. "ఈమాటలయొక్క నిదానమును పటుత్వమునునామనంబున నాడునాటినవినాటినట్లేయున్నవి. నామనస్సును గోడన పీమాటలను సూక్ష్మమైన బంగారుచీలల నాటి వాటికి తనవిజ్ఞానఫలమును పరంబుల తగిలించినాడు. నామహానీయుని విజ్ఞానమునకు పరమువంటి దానవే. నామనస్సును బుద్ధియు, చర్యలును నాయనయొక్క మహిమయొక్క ప్రతిబింబములేకాని యెక్కుడుకావు. ఈపరంబుల నేను కాపాడుకొని, లోకమునకు యందమలవారికి యానందమును శుద్ధత్వమును గరపిన నదియే నాజన్మమునకు విలువలేని ఫలంబవు." అనియు "ఈనుడువుల గాంభీర్యమును శక్తియు నాపవర్ణనాతీతములు. ఈ మాటల చెప్పుచు స్వాములు రెండుచేతులునెత్త సీనునువారి స్వరగర్జనచేతను వారిచూపుల మెరుపుల చేతను విభ్ర

మను గొన్నదానినై మేఘములయురుములను తొలుత విన్న శిశువులభంగి క్రిందవ్రాలి, మోకాళ్ళమీద కూర్చుండియుంటి. వారెత్తినచేతుల వారాడిన యా మాటల కనుగుణ్యంబుగా నాశిరముపై నుంచి నన్ను దీవించె. ఒక తడవు నాయొడలు నేనును మరచితి. అయినను నీతరుణము నాజన్మమున మరువరాని తరుణములలో నొక్కటియైనది. యోగప్రభ నన్నుగప్పినదై యీతరుణమున నాకు ద్వితీయజన్మమును కల్పించినది. తత్పూర్వమున నాకుండిన దైహికలోపములును మానసికలోపములును నను బాసి పోయినవి. మూసలోవేసి శుద్ధిచేసిన బంగారు ముక్కవలె నేను పరిశుద్ధనై శుద్ధ ఆర్యనైతిని. ఆర్యులభంగియే వీరివరప్రసాదముం జెంది యార్యనైతి" ననియు శ్రీనివేదితా సోదరియే వ్రాసియున్నది.

### శ్రీరామకృష్ణుల యోగదృష్టి.

ఇంతకు చాలాకాలము పూర్వము శ్రీరామకృష్ణ పరమహంసులు, వివేకానందులకు కొంతకాలమునకు కేవలము హస్తస్పర్శచేతనే దివ్యజ్ఞానము నిచ్చుశక్తిగలుగునని చెప్పియుండిరి. "ఇదిజ్యోతిషమో యోగదృష్టి

యో చదువరు లూహింపఁదగు. నేనూహింప నక్కఱ
లేదు. ఋజువులున్న విషయముల కూహలేల? నాటిసా
యంకాలమున నాల్గ్మోరాలో నాస్వానుభవమే యిం
దుకు నిదర్శనము.

'మనసు ధ్యానమగ్నమై బుద్ధింజేరె బుద్ధితోఁటి
యాత్మవంటి సమాధినిధిని మునిఁగితిని. అంతకుపూ
ర్వము యుక్తిమార్గములను తర్కప్రయత్నములనెన్నిం
టిచేతను నాయనుభవమునకుం దెచ్చుకొనని సిద్ధి నేను
కలిగినది. సులభసాధ్యమని నమ్మి హిందువులు తమది
నచర్యల యలవరించుకొను ధ్యానమార్గపు రుచింగంటి.
దానిఫలమైన యాత్మశాంతిని, దానిఫలమైన యాత్మ
ధృతిని బలమును బడయ సాధ్యమనియు నెఱింగితి.
ఉచ్చస్థితిని బడసిన దేశికులు వారిబుద్ధిబలముచేత మన
బోటి వారియందు జన్మాగతమైనట్టియు యింద్రియనై
జమైనట్టియు దైహికభావముల పారదోలి వాటిని
మించి చలనమొందని యాత్మీయభావమును గలగింప
గలరని నాకు నాడు స్వాముల పాదస్పర్శముచేత యను
భవమునకు వచ్చినది. రామునిచేత వధజెందిన రాక్షస

రూపముఁబాసి గంధర్వరూపము వడసి శాపవిముక్తుఁ డయ్యె, సుందరరూపుఁడును, శుద్ధచరితుఁడును నయ్యె నన్నమనము నగుదము. ఈవిషయమున నాస్వాను భూతినే నేనెట్లు నమ్మకపోవచ్చును ? వివేకానందుల పాదస్పర్శమహిమ నెరుంగుభాగ్యము నాకుండినదను టయే నాజన్మమునకు మెఱుఁగు" అనివ్రాసియున్నది.

### శిష్యగోష్ఠి ప్రవేశము.

ఇట్టినిదర్శనములచేత వివేకానందుల ప్రభావమును నెఱిగినదై మార్గరెట్ నోబల్ శ్రీరామకృష్ణశిష్య బృందము ప్రవేశించినది. ఈయమ మనస్తత్త్వమెట్లు మార్పుజెందినదో, ఈయమ జీవితపద్ధతి యెట్లిప్పటినుం చి మార్పుజెందినదో అట్లే యీయమయొక్క నామ మును మారిపోయినది. నివేదితయను పేరునుగై కొని 'నివేదితా సోదరీమణి'గా ఖ్యాతిగాంచె. తొలుత వివేకానందులకు సోదరియై, వెనుక శిష్యబృందమునకు సోదరియై, యటుపై హిందూమాతృ జనితస్త్రీజనంబు నకు సోదరియయ్యె. లోకంబునకంతకును నీమె సోదరియె. ఈమెదమాహాత్మ్యము నట్టిది. ఈయమ

సేవారతియు నట్టిది. ఇంగ్లండులో నున్నంతకాలమును యీయమ బుద్ధిమతవిషయమున ప్రవేశించినదికాదు. క్రైస్తవమతముగాని, నాస్తికమతముగాని యెద్దియు నీమెకు రుచింపలేదు. వీటిని బరీక్షచేయఁగూడ నీమె పూనినదికాదు. అప్పటికి జనసేవయే యీమె మతముగానుండెను. జనధ్యానముల నీమె యెఱుంగనదిలేదు. వాటిని గుఱించి తలచినదిలేదు. కాని వివేకానందుల బోధనవలన తుదకు హిందూమతము నవలంబించినది. ఉత్తమస్త్రీలు నగలధరించిన నగలకు విశేషకాంతికలుగును. అల్లే హాక్స్లీ మొదలైన తత్త్వజ్ఞుల మెప్పువడసిన బుద్ధిబలముగల యీయమ మనమతమునవలంబించుట మనధర్మముయొక్క మహిమాతిశయముల సూచించు. ఈవిషయము లెస్స నాలోచింపదగినది.

## మూడవ అధ్యాయము.

### అపరజీవితము.

#### ప్రవేశము.

ఈయమ మనదేశసేవను దీక్షగాఁ గైకొని మనదేశమందు వచ్చిచేరిన సమయమునుంచియే యీమెయపరజీవిత మారంభమైనది. దీనిపరిమితి పదునాలుగుసంవత్సరములు: పదునాలుగు సంవత్సరములు మనదేశమున సేవాతపస్సు నాచరించుచుండె.

రాముడు పిత్రీయ సింహాసనమును రాజ్యమునువదలిపెట్టి తనతండ్రికి సత్యసంధత్వముఁ జేగూర్ప రాజ్యసుఖములం దూరముచేసికొనె. ఇంతియెగాకయడవి కేగె. అడవియందు శాంతజీవనులై సత్త్వవంతులై పుణ్యాత్ములై యున్న మునిజనంబుల కష్టములబాప రాక్షసవధయను విద్యను విశ్వామిత్రులవలన నేర్చియున్నవాడై యీవిద్యను సంపూర్ణముగ నుపయోగించబయలువెరె. ఈతని క్షాత్రసంపత్తిని వినియోగపరచి యడవుల నాశ్రమవాసులై యున్న మునిజనంబులకు

మేలొనరించ ప్రయాణమయ్యె. అక్కాలమున రాక్షస బాధయనుచీకటి యీసాత్త్వికలోకంబు నావరించి ధర్మ చర్యలకు విఘ్నములు గావించుచున్న యాకాలంబను రాత్రికి చంద్రుడై రాముడుదయించి యాచీకటింబాపి వారికి సుఖమును గలుగజేసె. క్రూరరాక్షసలోకంబను భవనమునకు మూలస్తంభమైన రావణునిభేదించె. తన పాత్రసంపత్తిని వినియోగపరచి యీమహాత్కార్య ముల పదునాలుగు సంవత్సరములలో సాధించినట్లు లీమెయు తన దేశమున తనకు సులభప్రాప్యములై యున్న ఖ్యాతిసంపదలను వదలుకొని వివేకానందుల మాటపై గౌరవముంచి మనదేశమునకువచ్చి స్త్రీజనసేవయేగాక, వచనరూపమునను చరిత రూపమునను యెక్కాలం బునకును ఖ్యాతితేఁగలసేవనుజేసి లోకాంతరముఁజేరె.

కలకత్తాలోవాసము.

ఈయమ తనగురువుల యభీష్టమును నెఱవేర్పఁబూనుకొని కలకత్తాలోని యాచారవంతులగు బ్రాహ్మణ స్త్రీలగృహములమధ్య వాసస్థాన మేర్పరచుకొన ప్రయత్నపడెను. పాశ్చాత్య స్త్రీయైన నీమెకు బ్రాహ్మణగృ

హాముల నడుమ యిల్లు దొరకదయ్యె. ఆంగ్లేయులు మ్లేచ్ఛులనియు, వారిసమీపమునకుఁ బోయిన మైలసోకుననియు, వారుమనవీథులలో గూడ నడవగూడదనియు మనవారిలో ననేకుల యభిప్రాయము. రాజ్యమువీరి చేతయుండిన, వారిని మాలవాడలలో నివసించుమని యుత్తరువు లెప్పుడో పుట్టియుండును. అట్టియభిప్రాయముగలవారి నడుమ నివేదితాసోదరి వాసమేర్పరుచుకొనుట యెట్లు? మఱియు వారినడుమ చొచ్చుకొని వారికి విద్యాదికములను గఱపుట యెట్లుసాధ్యము? గొప్పకార్యముల కిడుములు గొప్పవై యుండు. వివేకానందులు అమెరికాలో చికాగోమతసభలో మాటాడనుద్దేశముతోఁబోయినపుడు ఈయనకనుదగిన సిఫారసులుండినవి. కాని ఖర్చులకై కొంచమైన ద్రవ్యము లేకుండెను. ద్రవ్యముండియుండిన వారికపుడు కలిగిన యధైర్యమునుపట్టి తిరుగ వారుమనదేశమునకు వచ్చియేయుందురని వారే వ్రాసియున్నారు. ఆకలిగొని దారిగానక డస్సి తనదీనస్థితికి నాశ్చర్యమును చింతయునుజెంది ఖిన్నుఁడై తుదకు తానొకవీథిప్రక్కనకూర్చుండియుండె. కూర్చున్న పదినిమిషములలోపల తనయెదుటనున్న మహాడీవాకిటి

తలుపుతీసి యొకగృహిణి, యాయన యపూర్వరూప
మును తేజమును కాషాయవస్త్రములను గని కుతూ
హలంబును మర్యాదయు నుప్పొంగ, నత్యాదరణతో
నాయనను లోనికి పిలుచుకొనిపోయి, స్నానపానముల
విచారించె. అటుపై నీయనవచ్చిన కార్యమును నెఱింగి,
యీ చికాగోసభకు సంబంధించిన ముఖ్యుల కీమెయు
నీమెభర్తయు గొప్ప స్నేహితులౌటఁజేసి యికమీఁద
వివేకానందుల కేలాటి కష్టములు సంభవిల్లుటకవకా
శము లేకుండునట్లు వారేర్పాటుజేసిరి. అట్లొనివేదితయు
కలకత్తాలో వాసస్థానమునకై చాలకష్టపడవలసివచ్చె.

## యింటికష్టములు.

అయినను తనశ్రద్ధచేతను శుద్ధచరిత్రము చేతను,
నెట్లో ఒకయింటిని సంపాదించెను. స్థానముకుదిరె గాని
సేవకులు దొరకరాయె. నీళ్ళు తెచ్చిపెట్టుటకును దీప
మువెలిగించుటకును, పనివారుదొరకరైరి. దొరకినను
స్థిరముగా నుండుటయు దుర్లభమయ్యె. ఈకష్టకారణం
బున నెన్నియోమారు లీయమ, భోజనమేలేక, పండ్లు
తినియుండెను, లేక ఇరుగుపొరుగువారు సదయులు న

సగౌరవులునై పంపిన పదార్థములభుజించి కాలము గడు పుచుండెను.

వీధులనూడ్చుట.

ఈమె మనస్త్రీలకు నేర్పిన విషయము లనేకములు. తాను స్వయముగా తనవీధిని యూడ్చు. ఆమెరాక ముందు మురికిమయమైన యాబోస్పారాగొంది యామె ప్రవేశానంతరము మిక్కిలి శుభ్రముగ నుండెను. కొం దఱిబాలురజేర్చుకొని తానున్న కలకత్తాయుత్తరభాగ మునంతటిని మురికివదలించి శుభ్రపరచినది. ఈవిషయ ములు జనక్షేమమునకు ప్రథమములును ముఖ్యములై నందునను యచ్చటివారికి వీనియందు శ్రద్ధాజ్ఞానములు లేనందునను వానినిఁగూడ ఈమెనేర్పవలసి యుండె. నాగరికతయొక్క తళతళలకు భ్రమఁజెంది కన్నులుచెద రిన మనకు వీధులనూడ్చుటయందు మహనీయతగాన బడదు. కాని విశ్వమునంతయు తమవలె చూచుకొను మహనీయులకు నివియె గొప్పకార్యములు, రస్కిన్నను మహనీయుఁడు ఇంగ్లాండుదేశపు దుస్థితి కారణంబున తీరని చింతలపాలైన వారిలో నొకడు. ఈయనచాల

ధనవంతుఁడు, బుద్ధిమంతుఁడు, ప్రజ్ఞావంతుఁడును. ఈ యన బీదవారియందు చాల కరుణగలవాఁడు. వారికి మంచిమార్గములనేర్పి సుఖమును గరపఁ జాలప్రయత్న పడినవాఁడు. విద్యకును విద్యార్థులకును ప్రపంచమునం దంతటను ప్రసిద్ధికెక్కిన ఆక్స్ఫర్డ్లోనికళాశాలలో నుపాధ్యాయుఁడుగా నుండినవాఁడు. ఇంగ్లీడులో ఋషి యని మెప్పువడసినవాఁడు. అట్టియీయన పనిదొరకక సోమరులై లెక్కలేక ఇంగ్లీడు దేశములోని గొప్ప పట్టణముల వీధులలో తిరుగుచుండువారిని చూచినపు డంతయుకన్నీరుకార్చి వారి స్థితికిచింతిల్లి వారికి పనిగలి పించి రస్తాలగులకవేయు పద్ధతిని చూపుటకై వారితోడ గులకరాళ్ళను పగులగొట్టుచుండె. వివేకానందు లమెరి కాలో నున్నప్పుడు తన శిష్యులకు మనదేశపు ఆహార పదార్థములవండి రుచిచూపించెనట. మహనీయులకు మంచి కార్యములయందు చిన్నగొప్పలను తారతమ్య ములుండవు. సూర్యుని కిరణములుభూమిపై సమస్త వస్తువులపైఁబడి వాటిని శుద్ధిచేసి బలమునిచ్చు. నక్ష త్రములకై యెల్లెడలను కిరణముల వ్యాపింపజేయలేక దృశ్యాదృశ్యములై యున్నవికదా ?

శిశుప్రీతి.

ఈయమకు బిడ్డలయందత్యంత ప్రీతికలదు. వారిని కన్నప్పుడంతయు వారిముద్దుముఖములయందు దైవత్వ మునుగను. 'బాలవాక్యం' 'బ్రహ్మవాక్యం' అనుప్రతీతిని పలుమారు విందుము. 'బాలముఖం బ్రహ్మ ముఖ' మని' చెప్పియీయమ వారిని దైవసమానముగానెంచి, గౌరవించి, ప్రీతితో వారిని దగ్గరచేర్చుకొని, వారికిజ్ఞానము గఱపి వారికి తల్లినిమించిన తల్లియై వర్తించుచుండెను. వారితోడనీమెమాటాడు శాంతిపద్ధతియు ఈమెమర్యాదయు, వారిమనంబులకు తియ్యనై యెపుడును నామె యొద్దనారుందురు. నివేదితయొక్క తండ్రి తనబిడ్డలనెట్లు పెంచినదిని యీసందర్భమున జ్ఞాపకమునకు తెచ్చుకొనుట మనసునకానందమునిచ్చు.

విద్యాదాన పద్ధతి.

కేవల గ్రంథపఠనముననే బాలికల దీర్చునుద్దేశమామెకులేదు. పుస్తకముల నొకదాని వెంబడి నొకదానిం జదివి, గుడ్డిపాఠములంగావించి, చిలుకలవలె వారుచదివిన వానినేవల్లించంగలిగినవారుగ వీరినిజేయుట యీయమ

కొంతయు నయిష్టమయ్యె. చదువుటయు వ్రాయుటయు వీరికి నేర్పు. కాని వీనికితోడుగ నితర జ్ఞానములుకూడ గఱపుచుండు. ఈకాలమున మనపాఠశాలలలో చదివి వెలువడు బాలురును విద్యాపరిషత్తుల పరీక్షలగడిదేరి బి. ఎ. యం. ఎ. బిరుదుల తగిలించుకొని వెలువడు వారును అనేకులు చిలుకలేకదా! విద్యాపరిషత్తుల పరీక్షల గడిదేరిన వీరును గుడ్డిపాఠమున వీరులు. స్వకీయముగ నాలోచన చేయుశక్తి యొకింతయు లేదు. అభ్యసింపబడిన గ్రంథముల నెద్దియున్న నదంతయు వీరిమెదడున నచ్చువేయబడినట్లు స్థిరమైయుండు. ఎంత వఱకు స్థిరములై యుండు? ఆయాగ్రంథములయందుఁ జేయఁబడు పరీక్షలనాటి సాయంతనమువఱకు! పరీక్ష కాగితముల ప్రశ్నములకుత్తరముల వీరువ్రాసి ముగించిన నిమిషము మొదలు వీరుచదివినది మాసిపోయినదే. వీరిమెదడను పలకమీఁదవ్రాసి రెండుమూడు సంవత్సరములుగ గాపాడబడియుండిన ఈసంగతులు నాటి సాయంతనమున తుడిచి వేయబడుచున్నది. ఇష్టము లేకయు నుత్సాహములేకయు, మనోనుభూతిలేకయు నిన్నినాళ్లుగ పిచ్చికారునకొట్టినట్లు రాత్రింబగళ్లుమెదడు

కెక్కించిన నీవిషయము లామెదడు నుంచి చెడిన నల్లని రక్తమువలె శిరానూపమున కలమునకెక్కి యీనష్ట రక్తము దేహామునుండి బయలు వెడలిన కారణంబు చేతనోయన్నట్లు నాటిరాత్రి వీరు శిశువులభంగి గాఢ నిద్రంజెందుచున్నారు. ఇంతియెగాక దూరదేశమున రెండుమూడు సంవత్సరములు చదువనకై విశేష కాలముగడపి రాత్రింబగళ్ళు చదువుటచే కండ్లుగుంటలు పోయి రొమ్ముగుంటపడి పరీక్షలనిచ్చియింటికి వచ్చిన కుమారులకు, బెట్టదీరుటకై యింటివారు ప్రీతితో తల యంటి స్నానము చేయింతురు. ఈయభ్యంగస్నానమె గ్రంథగళన రోగనివారణమైన తరువాత యారోగ్య స్నానము. ఈస్నానమైన నాటిరాత్రి వీరికి మఱింత గాఢనిద్ర ప్రాప్తించు. అహోరాత్రాక్షర వీక్షణము చేత గుంటలుకొన్న నేత్రములకును కరిగియు వాడియు న్నమెదడునకును, కొంచెము విశ్రాంతిగలిగి జీవన సుఖమన్నదెద్దియో యది తెలియనగును. ఇవియికాల ములమున మనదేశమున నెగడియున్న పరిషత్తులచే విధిం పబడిన పద్ధతింజదువువారిస్థితి. వీరికివచ్చునది విద్యకాదు కాని తథ్యమైన దేహదౌర్బల్యమును బుద్ధిబద్ధత్వమును

మాంద్యమును. విద్యాపరిషత్తులచే నియమింపఁబడిన పద్ధతుల వారు నియమించు విషయములను గ్రంథములను చదివినవారి దుస్థితిని నీమె బాగుగ నెఱింగినది.

## చదువన్న నెట్టిది?

వీనియందీమెను గానవచ్చిన లోపములనేకములు గలవు. వీరిచదువులు మనస్సుయొక్క యుత్సాహ ఫలంబులుగావు. అట్లుగాక యీచదువులు మనోమారకము లవుచున్నది; మనోమారకములయి ప్రాణగ్రాహకములుగా నవుచున్నవి. ఈచదువులెట్లు విషమ ఫలవంతములై యున్నవో యీక్రిందినిదర్శనమున దెలియనగు. చెట్టుకు నీళ్లాధారము. నీరులేకున్న చెట్టు క్షీణతఁ జెందినశించు. ఈకారణమున నొక మొలక పైభాగమునంతటిని నీటిలోనే యెడతెగక పెట్టియున్న నామొలక కేమికలుగుచున్నది? ఆమొలుకుళ్లి చెట్టు తేజోహీనమై నశించు. చెట్టుకునీరు వేళ్ళమూలమున నెక్కిన లాభకరముకాని మండలను నీటదడిపి పెట్టినంతటనే చెట్టుకు ప్రాణము బలము కలుగదు. దేహమునకు సంపూర్ణారోగ్యము కలిగి, మనస్సు అనుంతతశక్తికలిగి

యుత్సాహవంతమై, గ్రంథపఠనముచేసి జ్ఞానమార్జించ వలెనన్న, అట్టిమనస్సునకు చదువుటయు సులభము. చదివినది శీఘ్రముగ నమరును. 'అమరములేని వానికి నేనమరను' అని సరస్వతీదేవి చెప్పినదట. 'ఆరోగ్యము లేనివానికి నేనమరను' అనియు విద్యాదేవి చెప్పుచున్నది. ఈవిషయము నాలోచింపక మనవారు గ్రంథపఠనమే విద్య గఱపుననియెంచి, తమబాలుర గ్రంథముల పాలు చేయుచున్నారు. పఠనము మనస్సునకుత్సాహమును ఆసక్తియు పుట్టినప్పుడొనరించిన నదిప్రయోజనకరమౌ నుకాని, యదియేపనిగా గావించిన ప్రాణహాని కరము గును. దేహమునకు నీరు ముఖ్యము, ఆరోగ్యకరము. ఆకారణంబున మనమెప్పుడు నుసీటమునిగియుండదగునా?

ఈవిధంబున నెంచి యీదీర్ఘదర్శిని స్త్రీలకు చదువు నేర్పుటలో నట్టిపద్ధతుల యవలంబింప నియ్యకొనినది కాదు. ఈమెచుట్టును ప్రీతితో జేరియున్న బాలికలను 'కిండర్‌గార్టను' బడి నొకదాని నేర్పఱచి నడుపు చుండె. ఈ బడి స్వభావమేమి? చదువును, జ్ఞానార్జన మును పిల్లలకు చేదుగా చేయుటకు బదులుగా తియ్యనిదిగా చేయుటయే; బడికిపోవుటపిల్లలకు ప్రాణసంకట

మయినదానిగఁజేయక ప్రియమైనదిగాఁ జేయుటయే; బడియన్న నేడ్పించక, బడియన్న నవ్వించుటయే.

## కిండర్ గార్టెన్ బడి.

ఈబడి యెట్లుండును? పూర్తిబూయని దుమ్ము రేగు నేల కలదికాదు. రెండంగుళముల మందముకు మట్టి పేర్కొనియుండు నేలపై తాటియాకు చాపలపై బాలురు కూర్చుండియుండు బడికాదు. వాకిలికెదురుగ కూర్చుండబెట్టిన, వీధిని బోవువారింజూచి వారితమచదువు లను మరచి పోయెదరని భీతిల్లి, చీకటిలో నొకమూల గూరుచుండబెట్టిన పిన్నలబడికాదు. ఇప్పటికిని కొన్ని గ్రామ పాఠశాలలలో, బాలుర నిట్లు కూర్చుండబెట్టి యుండుటసామాన్యమైయున్నది. చీకటిమూల నందఱు గుంపుగా కూర్చుండియుందురు. వేసవికాలమున నొక నాటి మధ్యాహ్నమున పోయిచూచితిమా, యీబడు లలోని పిన్నలు గోడల రంధ్రములలో దాగియున్న నల్లుల పుట్టను మనకు జ్ఞాపకపఱుతురు. గాలిలేమిచేత చమటలు కారుచుండు. అందరును గోచిపాత రాయుళ్లుగా నుండుటచేత నీచమటను తుడిచివేసికొను

టకు వారికి మార్గముండదు. పైనచెప్పినదుమ్ము వీరి కాళ్ళుకదలుటచే రేగి వీరిదేహమునంతటను వ్యాపించి కారుచున్న చెమటలనంటి యచ్చటనే నిల్చియుండు. లేక చారలుపెట్టికారుచుండు. ఉపాధ్యాయుడు వేరే పని చూచుకొనుచున్న, నీబాలురు చిన్నవారైన కారణమున కొందరు నిదురపోదురు. ఈచారలతోటి వీరినీస్థితినున్నపుడు చూచితిమా యనేకసంవత్సరములుగ భక్తులు నెత్తినపెట్టిన దీపముల చమురుచారలతోను గాలికి పైనపేరియున్న ధూళితోను కూడుకొనియున్న రాతి విగ్రహములు మనస్పృహకువచ్చు. ఇంతియును గాదు. ఉదయము 6ఘంటలకువచ్చి యప్పటినుండి సాయంకాలమువఱకు గువ్వలవలె కూర్చుచియుండియు (బళ్లారితాలూకాలోని గ్రామబడులవలె) రాత్రి 8½ ఘంటలవఱకు వరుసగనిల్చి యెక్కములవల్లించు బాలుర బడియుకాదు. పుస్తకములనుండు మాటల చదివి వానిని చిలుకపలుకులుగా నొప్పగించు బడియుకాదు.

వస్తుదర్శనమా ప్రతిమదర్శనమా.

ఈబడికి పిల్లలతిప్రియముతో పోవుదురు. ఇంట నుండుటకన్న యీబడియందుండుటయే వారికి సంతో

షమునిచ్చు. ఉపాధ్యాయునిగన్న వానిదగ్గరజేర నుప్పొ ల్లూరుచంద్రుకాని అయ్యవారన్న దయ్యమును గన్న టుండరు. వివిధవిధమైన చెట్లనుపరిశీలించి చూచుటయు, వివిధమైన ఆకులను, పుష్పములను నేత్రములతో స్వయముగాజూచి, వానివిషయముల గ్రహింతురు. కాని, వానిచిత్రముల గోడకుతగిలించుకొనియు, వానిని గుఱించి పుస్తకముల చదువుటవలన నేర్చుకొనుటయు లేదు. నాలుగుపుటలలోని సంగతుల చదివి యర్థము చేసుకొని, యందుల ముఖ్యవిషయముల నేర్చుకొని చింతనమునకై మదిని నిల్పుకొనుట కెంతప్రయత్నము కావలసియుండును? ఎంతకాలమునుపట్టును? ఇందులకు బదులుగా వస్తువులనే గమనించి చూచిన నతిశీఘ్రకాలమున నే మనసుకు విషయములు గోచరములవ్వుగదా. నల్లనికారుమబ్బు స్వభావమును బాలురకు తెలుపుట కాకాశమున నట్టి మబ్బును చూపినవారికి సులభముగ తెలియునా లేక అట్టి మబ్బుయొక్క చిత్రము నొక దానిని ముందునిడిన సులభముగా తెలియునా?

అట్టి చిత్రమును వారిముందఱపెట్టిన ప్రయోజనకారియగానా లేకదానిగూర్చి 4 పుటలవిషయముల చెప్పి

వ్రాసుకొనమని దానిని చదివి గ్రహించమనిన నదిప్ర యోజనకారిగనౌనా? పటమునకన్న మబ్బే మేలైన విధమున పిన్నలకు జ్ఞానమునిచ్చు. వానింగూర్చిన వ్యాసమునకన్న పటమే మేలైనవిధమున జ్ఞానమునిచ్చు. పటమును చూచి నేర్చుకొనుటకన్న మబ్బునేచూచి నేర్చుకొనుటయు బాలుర కింపుగాను ఆనంద కరముం గాను నుండును. మబ్బుచు చూడఁదగిన మెఱుపులు పరమున గనుపడవు కదా. ఇట్టిపద్ధతుల నేర్పిన ప్రతిభ జనించు. ఈవిషయముల గుఱించి మూలగదులలో కూర్చుని ఉపన్యాసకరణముభంగి వల్లింపించుటకన్న బాలుర బయట తోటలకు నదియొడ్డులకు గొనిపోయి వానిని పరిశీలించి చూచి వానివిషయముల నేర్పుటయే మంచిదని యీామెయొక్క యభిప్రాయము. దేవళము లకు గొనిపోయి, విగ్రహముల చూపించుచు వానిని చెక్కుటలో గనుపరచిన నైపుణ్యముల బాలురకు తెలియజెప్పవలె. దేవళములవద్ద గోపురములను వాటి యాకార మహోన్నత్యమునుజూపి, వాటిని కట్టించఁగలి గిన రాజులును ధనికులును మనదేశమునందుండిరనియు, ఈగోపురములలోని దివ్యాంపుప్రతిమల నిపుణతతో

శక్తిగలిగిన శిల్పకారులు, మన దేశమున నుండిరనియు చెప్పింప నీమెప్రయత్నించును. దేవళములోని గోడల లోనుండు యక్షరములు పూర్వులశాసనములనియు, వీనివలన పూర్వపురాజుల పేర్లును,వారికిని యాయా దేవళములకు నుండియుండిన సంబంధములను తెలిసికొన వచ్చుననియు నీమెనేర్పించె. ఉత్సవంబులకు వెళ్లుటలో చాల ప్రయోజనమున్నదని యీయమయభిప్రాయము. ఎట్లన్న, అచ్చటచేరు సమస్తజనముల వివిధపద్ధతుల గమనించి వారివారి వేషభాషల యాచారముల గురించి నేర్చుకొనవచ్చు. తిరుపతివంటి మహాస్థళ మునకు పోయియుండిన యచ్చటికి వివిధదేశముల నుండియు వచ్చుజనులను చూడవచ్చు. హిందూ దేశమున సకల ప్రాంతముల నుండియు జనులు యాత్రార్థమై యచ్చటకువత్తురు. వీరల విషయమై యనేకసంగతుల నాస్థళమునను నట్టి యితరస్థళములను నేర్చుకొనవచ్చు.

బాలికాగోష్ఠి.

విద్యాదానమున నిట్టి యభిప్రాయములు గలదై యీమె కెంజన్ గార్డెన్ బడినే బాలికలకు తమపద్ధతిగా నెంచి యొకదానిని స్థాపించె.

## స్త్రీశిష్యగోష్ఠి.

బాలికలు రాసాగినవెంటనే యీబాలికలతల్లులును యితర బంధువులును విశేషముగ నీమెచెంతఁ జేర సాగిరి. ఈమె యొక మ్లేచ్ఛస్త్రీయనియు, నట్టిదానికి బ్రాహ్మణులైన తమయిండ్ల వాసమునకు చోటియ్య కూడదనియు, యీకారణంబువనే చోటుదొరకకూడ చేటిదొరకక నివేదిత తనయింటిపనులను తానేచేసుకొను చుండెననియు చెప్పవలసినకాలము పోయినది. ఇపుడు శుద్ధాచారవంతులైన స్త్రీలుయీమెసహవాసముంగోరి యీయమయింటినినొక యాశ్రమముగా నెంచి యచటికి వచ్చుచుండిరి. వీరికి తగిన జ్ఞానదానమునకై నొకతరగతి యేర్పడె. బాలికాశిష్య గోష్ఠికి తోడుగ ప్రౌఢ స్త్రీశిష్య గోష్ఠియుప్రారంభమయ్యె. ప్రతిభావంతులును ప్రజ్ఞావం తులును, యెట్టివారికిని జ్ఞానము గఱపఁగలరు. మొలక లకుతగినప్రాణమును వానికిని, ప్రాణులకుతగిన ప్రాణ మునువీనికిని నందజేసిసూర్యుడు వాసిం బెంచుటలేదా!

## స్త్రీభక్తగోష్ఠి.

ఈప్రౌఢ స్త్రీలు కేవలము శిష్యగోష్ఠియేయై యుండ లేదు. శిష్యగోష్ఠిభక్తగోష్ఠిగా పరిణమించినది.

ఈయమకు వంటచేసిపెట్టు వంటకత్తెనుగూడ నీయ నట్టియు, యెవతెయైన నొకరితె కుదిరినను నాపెను చాలదివసము లుండనివ్వనట్టియు యిరుగు పొరుగు స్త్రీ లిప్పుడు భక్తప్రాయులైరి. ఇపుడామె తనచేతిమీ దుగవిరచియిచ్చిన రొట్టెముక్క వీరికమూల్యంబయ్యె. శ్రీనివేదిత చేతి ప్రసాదము వీరికి నివేదిత ప్రసాదము లయ్యె. “ గుణాఃపూజాస్థానం గుణిని నచలింగం నచ వయః ” గుణాఃపూజాస్థానం గుణిని నచదేశంనచకులం.

### జోసమ్మ ప్రయత్న విపాకము.

వివేకానందుల యాదేశ మీమెకు చాలముఖ్యమై యుండె. దీనినెరవేర్చుటలో నీమె కెట్టికష్టములు సంభవించినది యెరుగుదుము. అయినను నొకచిన్నయంశము నిచ్చుటఁ బేర్కొన కుతూహలంబు మెండై యున్నది. తొలుత నీయమ మనదేశమునకు వచ్చిన క్రొత్తలో కులీనులైన బ్రాహ్మణుల నడుమ వాసస్థానము నేర్పరుచుకొన నెట్టిప్రయత్నములఁ జేసినది చూచితిమి. ఇంకను నీయమ యిష్టప్రకారము స్త్రీలఁజేర్చుకొనుటకు కూడ కొంతప్రయాస పడవలసియుండె. ఈకారణం

బులచేతనీమె డాక్టర్ బోసుగారి భార్యగారిసహాయము నపేక్షించె. బోసమ్మయు కొంతప్రయత్నము చేసి తుదకది యసాధ్యమనియెంచి ప్రయత్నములమాని యీసందర్భముల నివేదితకు తెలియజేసె. బోసమ్మ కలకత్తా స్త్రీలలో చాలయున్నతపదవిఁ జెందినట్టి విద్యావతి. అట్టియీమెయొక్క ప్రయత్నములుకూడ ఫలవంతము లైనవిగావు.

నివేదిత ప్రయత్న పరిపాకము.

కొంతకాలము గడచినది. ఇక్కాలమంతయు నివేదిత మనస్సెంతయో ప్రయత్నములఁ జేయుచుండినది. ఈయమయొక్క మనోనిశ్చయమును, దీర్ఘదర్శనమును వెనుదీయని యుద్యమమును, బోసమ్మగారి గౌరవస్థితియు నుపన్యాసములును సాధించలేనివానిని సాధించినవి. ఒకనాడు బోసమ్మగారిని బోస్వారా పీఠికలోని తన గృహమునకు రమ్మని కోరెను. బోసమ్మ పోయినది. పోయి చూచునప్పటికి సూర్యుడు పశ్చిమమున నుదయించెనను విషయ మెంతటి యాశ్చర్యము నేరికైన కలిగించునో యంతటి యాశ్చర్యము బోసమ్మగా

రికి కలిగినది. బోసమ్మగారి కసాధ్యమై తోచినది నివేదితకు సాధ్యమై తేలినది.

## అసాధ్యసాధన కారణములు.

ఈవిషయమున నసాధ్యము సాధ్యముగా పరిణమించినందులకు కొన్ని కారణములు గలవు. వానిని మనము తెలిసికొని వానిం గుఱించి యోచింపఁదగియున్నది. మాటాడక శాంతినివహించి గాఢమైన చింతలనెరవేర్చువారు మహత్కార్యముల సాధింతురు. దుష్టకార్యమునకైనను మంచికార్యమునకైననుసాధనకారణమిద్దియే. తమయుపన్యాసములలో నొకచోట 'మనమకుంఠితమైన యేకాగ్ర చిత్తతతో నొకతలంపును రాతిగోడలుగల పర్వతగుహలో కూర్చుండి, తలంచి, యచ్చటనే మృతినొందినను, మనతలంపంతటితో నిలచిపోదు. తలంచినవాఁడు నాశనము చెందినను తలంపు లోకంబునకు వ్యాపించి బలవంతమై నెగడు. ఇందులకుదాహరణ మిక్కాలమున శ్రీ రామకృష్ణ పరమహంసులే. వీరు పాఠశాలలోగాని కళాశాలలోగాని చదివినవారు గారు. తలంపున నైజమైన నిపుణత వీరిబుద్ధి కబ్బి

యుండినది. ఆకారణముననే వీరు గొప్పతలంపులఁ దలంచి, మహత్తరజ్ఞానమును వడసిరి. ప్రగల్భతలేక ఏకాంతమున వీరునెవేర్చిన తలంపులు లోకంబుననెల్ల దిక్కులఁ బ్రసరించినవికదా. బుద్ధి కిట్టిశక్తియున్నది. బుద్ధిబలము హెచ్చవలయుననిన శాంతతయుమితభాషిత్వము నమరవలె. ఒకానొకరు కిచనర్ ప్రభువుగారిని గూర్చి వ్రాయుచు 'వీరిమితభాషిత్వమె వీరిగొప్పతనమునకు కారణము. వీరు తలపెట్టినది జరిగియేతీరును.' అనివ్రాసిరి. తలంపుయొక్క స్వభావమిది. ఈకారణమును పట్టియే మనపూర్వులు తపోనిష్ఠయనుదాని నవలంబించుచుండిరి. నివేదితయుతన మనశ్శక్తినంతయు తనయభీష్టకార్య సాధనపై మోపి నందుననే యసాధ్యము సాధ్యమైనది.

## సోదరీబృందము.

ఈవిధమున నివేదిత తొలుత బాలికలకును నటుపిమ్మట వారితల్లులకును నసమాన విద్యాదానపద్ధతిని నసమాన ఉపాధ్యాయి యయ్యె. ఇంతియెగాదు. తల్లితండ్రులులేని బిడ్డలకును పెనిమిటిని గోలుపోయిన బాలికల

కును స్త్రీలకును నీమె కరుణానిధియయి యుండె. పతిహీనల నుపాధ్యాయురాండ్రుగా తయారుచేయుట నీమె ముఖ్యోద్దేశమును బ్రయత్నమునై యుండె. ఈ విధంబున నివేదితయొక్క గృహమొక యాశ్రమమయ్యె. దీనికి సోదరీబృందమను పేరుఁబెట్టిరి.

## కాశీఘట్టాశ్రమము.

బోస్పారా వీధిలోనుండిన యీమెయిల్లే ఆశ్రమము. ఈయాశ్రమమున నీయమ సల్పుచుండిన మానసిక తపోహోమ ధూమముయొక్క సుగంధము ఖండాంతరములకు బాఱి అచ్చటినార్లనేకులు మహోన్నత పదవినుండువారు తీర్థయాత్రకుఁబోవువారివలెవచ్చి యీయమయొక్క యార్యజీవిత పద్ధతులను, ఆశ్రమమును దర్శించిపోవుట సహజమైయుండె. ఈయాశ్రమమున నీమెయొనర్చిన సేవాకారతపస్సును లోకకార్యానుబంధసత్త్వమును ప్రణవమంత్రమును యీమెకు మానస దుహితలైనబాలికలను, గని యత్యాశ్చర్యంబును గౌరవమును చూపుచుండిరి. శాంత్యర్థులై పలువురు మార్గంబులేక శాంత్యబ్ధియైన నీయమ సంసర్గాబ్ధి

లోన స్నానంబుసల్పినంతనే సంతాపంబుబోవ సత్త్వం బుఁవడసి శాంతిసంపన్నులైరి. అనేకములైన నూతన విషయముల గ్రహించిపోవుచుండిరి. ఈమెను దర్శించిన కారణముచేతను, యీమెతోడి మైత్రిగలిగించుకొ నిన కారణముచేతను యీమె పద్ధతులయందలి సార మును నెఱింగిన సంతసముచేతను వీరలు యాత్మతృప్తి పూరితులవుచుండిరి. వీరికి యీయమయందు భక్తిప్రే మలు హెచ్చినవి. ఈమెమూలమున, నీమె తల్లిగా గైకొనిన మనదేశమునకు కూడ ఖండాంతరస్థులవలన గౌరవము గలిగినది. హిందూదేశమన్న పెడచెవుల పెట్టుచున్న పాశ్చాత్త్యులకిపుడు హిందూదేశముపేరు విన్నంతనే రోమహర్షణఁజేయిపోవును. కొందరి రెండుచే తులును రోమహర్షముందటయంజలి యాకారమునఁజేరు. ఇంతటి గౌరవమునకు, నివేదితయునింకను యామెవంటి నితర మహనీయులే కారణంబులు.

### ఆశ్రమఘటనము.

వివేకానందులు అమెరికాకుపోయి చికాగోమత మహాసభయందు ఖ్యాతిగాంచినతరువాత, వీరిని యా దేశస్థులుచాల గౌరవించుచుండిరి. వీరియుపన్యాసముల

యందు వారికి రుచియు శ్రద్ధయు మెండైయుండినవి. ఆకారణంబున కొందఱుపిలిచి ద్రవ్యమునకై కొన్ని వ్యాసముల నిమ్మని కోరిరి. కాని డబ్బుతీసుకొని చదువు చెప్పుట యార్యధర్మము కాదుగావున దానికివారియ్యకొనరైరి. అయిననువారు తమప్రియశిష్యులకుపన్యాసముల నిచ్చుటకు చోటు చాలినంత దొరకమిచేత ద్రవ్యమునిచ్చిన వారే యుపన్యాసమును వినుటకు యేర్పాటు చేయవలెసె. అట్టియుపన్యాసముల నియ్యకొనుటకు వీరెట్టికారణము చూపిరి? హిందూధర్మముగ, శిష్యునికి గురువు జ్ఞానదానమె గాక యన్నదానము కూడఁ జేయవలెనని చెప్పియుంటను గమనించి తనయుపన్యాసములవలన వచ్చినద్రవ్యమును వేదాంతజ్ఞానమును ప్రచురింపదగిన యుద్యమములకేవిని యోగపరచుచుండె. అట్లే నివేదితయు తానుగతప్రీతితో స్థాపించి పెంచిన నీ'సోదరీగృహమును' తనస్వార్జిత ధనముచేతనే పోషించుచుండె. ఈయమ జ్ఞానదాయకములైన గొప్ప వ్యాసముల మాసపత్రికలకు వ్రాయుచుండె. కొన్ని గ్రంథములను ప్రచురించియుండె. వీనివలన సంపాదించినద్రవ్యమును వ్యయపరచి తనయాశ్రమమును పోషిం

చుచుండెను. పశ్చిమమున నివేదిత తల్లి మరణానంతర మొక నారీమణి నివేదితను తనకూతురుగా భావించుకొని యామెకు ధనసహాయముచే తోడ్పడుచుండెను. ఈధనముచేతనే ఈమె బీదవారికి సహాయము చేయుచుండు. ఆకలిగొన్నవారి కన్నమిడుచుండు. అనేకమారులన్నమేలేనక తానుపవసించుచు బీదలం బోషించు.

## ప్లేగురోగులు.

ఈమొకలకత్తాలో వచ్చిచేరిన క్రొత్తలో నచట ప్లేగు జాడ్య మారంభమయి జనుల కపరిమితభయము పుట్టియుండెను. రైలుబండ్లను, ఓడలును, పట్టకుండ జనులు ఊరునువిడిచి పారిపోవుచుండిరి. ఈజాడ్యమును తుపానుపురముపై వీవనారంభింప దానిపాలై నేలవ్రాలి మగిడినవారి సంఖ్య యమేయము. అనేకుల నీతుపాను గడ్డిపోచలవలె కొట్టుకొనిపోయెను. ఈజాడ్యమిట్లుద్రేకించి యింతటిభయము జనులకు జనించియున్న సమయమున నివేదిత మూర్తింగొన్న కరుణారసమోయన్నట్లు ధైర్యవతియై యిల్లిల్లును తిరిగి వీధివీధినితిరిగి భయగ్రస్తులకు ధైర్యములుచెప్పి, మనస్సులకు స్థైర్యముగరపుచుండెను.

జాడ్యగ్రస్తుల తాను తాకి వారికి కావలసిన యుపచర్యల నన్నిటిని చేయుచుండె. ఒకబీదయింటివద్దతనతల్లియీ క్రూరజాడ్యము పాలై చనిపోయియుండ, తానునుజాడ్యమునజిక్కి నివేదితచేయు నుపచారములంబడసి, తుదకు నాయమ యొడిలోనే ప్రాణమువిడిచె.

శుద్ధప్రేమస్వభావము.

అకళంకప్రేమ స్వభావమునుగూర్చి యొకవో ప్రసంగించుచు తనబిడ్డ పులినోటబడునట్లు సంభవించిన, తల్లి యెచటనుండు, ననిప్రశ్న వేసుకొని, పులినోటికి తన బిడ్డను మధ్య యడ్డపడునని చెప్పి ఇదియె అకళంక ప్రేమస్వభావమని శ్రీవివేకానందులు చెప్పియున్నారు. ప్రతిఫలంబు నపేక్షించమియే శుద్ధప్రేమ. తనబిడ్డను తల్లి రక్షించుకొనుట లోకసామాన్యము. కానిలోకములోని బిడ్డలనెడతల్లికి మించినతల్లియై ప్రీతింజూపి యిట్టి యుపచారములం జేయుస్వభావము నివేదితవంటి దైవజాతలయందే గన్దుము. ఇట్టివారిసంఖ్య గణ్యమే కాని యగణ్యముకాదు. అదియగణ్యా మెపుడవునా యనునది నివేదితయొక్క దీర్ఘచింతగాయుండె. నివేదిత యొక్కచరితము లిట్టిదైవాతీత ప్రేమునపూరితములు.

దైవాతీతశక్తియన నెట్టిది? ఇంద్రునిగుఱించియనేక గ్రంథముల మనవారువ్రాసియున్నారు. ఇంద్రునికి శుద్ధగుణము లున్నవా? లేవు. దేవతలయధిపతియైన ఇతడు సాత్త్వికులును శుద్ధచరితులునైన మునులసహాయముఁ బడసియుండె. కానిదైత్యుఁడైన రావణునియందుండు దుష్టచరితములనితని యందును గందుము. రావణుడు సీతను గొనిపోయిన నింద్రు డహల్యను చెఱపెట్టె. ఇంద్రుడు సాత్త్వికులచే సహాయము వడసెనేకాని సాత్త్వికసంపన్నుడుకాఁడు. ఇతనియందు దైవత్వము నులేదు. రామునికన్న మనోనిశ్చయ విషయంబున నితఁడు తగ్గినవాఁడు. ఇంద్రుఁడు దేవదేవుఁడను ప్రతీతి నంగీకరించితిమా రాముఁడు దేవాధిపుఁడని చెప్పవలసి యున్నది. ఇది దైవాధిక శక్తి (Super-divine energy). దైవాధికప్రేమయెట్టిది?

పూర్వపు మనమునులు చాలాకాలము తపస్సుఁజేసినగాని దైవానుగ్రహము కలుగలేదని మనముచదువుదుము. కరుణారస పూరితులగు పూర్వకాలపు వాల్మీకాది మహామునిజనంబులును, యిక్కాలపు పశ్చిమములో పేరుబొందిన సెంట్ ఫ్రాన్సిస్ను మనదేశమునకు

తన్నునివేదనముగా జేసుకొన్న నివేదితయు, వీరిలోకవి శాలమైన కరుణారససిధిత్వముచేత దైవమునుమించిన ప్రేమవంతులు. వేడినవారికే దేవుడు మోక్షమిచ్చు. వీరన్ననో యడుగనివారికి కూడ తమకున్న దానినంతయు నిచ్చినవారు. ఇదియె దైవాధికప్రేమయు కరుణయు. దైవమన్న నెద్దియో యనియెంతురు. నరోత్తములే దైవములనిచెప్ప యుక్తియుక్తముగా నున్నది. కొందఱునరులు దైవములకన్న గొప్పవారు. దున్నపోతులయాహుతిగా నపేక్షించు గంగమ్మ పోలేరమ్మల కన్న టెంకాయలతో తృప్తిచెందు దైవములున్నవి. టెంకాయలనుకూడ నపేక్షించక కేవలమ మనశ్చింతన ధ్యానములవలననే తృప్తిచెందుదైవములున్నవి. ఇవియు నక్కఱలేక లోకములోని యశేషభూతములకు క్షేమముగఱపు నరోత్తములున్నారు. అందఱిలో నెవరెక్కువ? కడపటివారే యెక్కువ. సచ్చరితులైన నరులే దైవాంశములుగాను దైవావతారములుగాను పరిణమించినారు. సచ్చరితత్వమే దేవత్వము.

## తూర్పుబంగాళాలో ప్రళయక్షామము.

1906-సం॥న తూర్పుబంగాళమున క్షామబాధ విశేషమైయుండినది. అగ్నికివాయువు సహాయమైనట్లు క్షామమునకుతోడు అనావృష్టి ప్రళయమునువాటిల్లి జనులకు కలిగిన దుఃఖమంతింతయని చెప్పనలవికాదు. ఈవిధముగ క్షామదేవత విజృంభించసాగిన విషయము చెవిసోకినప్పటినుండియు నివేదితకు నిర్వేదనము జనించి నిదురపట్టదు. భూమియందెవరికైన బాధలు వాటిల్లి యుండిన నీయమను ప్రాణము తల్లడిల్లును. నీయమ హృదయము నెమ్మదికి దూరమవు.

క॥ పొరిపొరిదినములు గడుపఁగ।
వరదలలో నడచు నీమె వాత్సల్యమునన్।
పురిపురికి నరిగి యెప్పుడు।
బరిసలలో (Barisal) నున్న వారిబాధల బాపెన్॥

ఈప్రాంతముల నీకాలమున నీయమగనిన ఘోరములన్నిటిని 'తూర్పు బంగాళములోని ప్రళయక్షామము' అను గ్రంథమున వర్ణించి యున్నయది. తేమ భూములలో విశేషముగ దిరుగుటచేతను, నచ్చట

చాలకాలము బసచేయుటచేతను, దేహమును పరిచర్యల నెడతెగనిపాటుల పెట్టుటచేతను నీయమకు 'మలేరియా' యను శీతజ్వరవ్యాధి సంభవమయ్యె. ఈజ్వరమున నీమెపడిన బాధవిశేషములకన్న, తానచట తనకంట జూచియున్న కష్టములను మనసుకు దెచ్చుకొనిన, నామెమనస్సుకు నూతనమైన భయముజనించు. దేహము గగుర్పాటునొందు. ఈవరుస జ్వరము నిలిచి పోవుటకు చాలకాలము పట్టినది. అప్పటికిని నిశ్శేషముగ నీవ్యాధికుదిరినదికాదు.

స్థానప్రీతి.

ఈమెయొక్క యీదీర్ఘవ్యాధి కుదురుగాకయుని యీమె స్నేహితు లనేకులీమెను కలకత్తాలో ఈమెయున్న ప్రదేశమును వదలి మరియొక యారోగ్యవంతమైన ప్రదేశమున వాసము కుదుర్చుకొమ్మని చాలనొక్కిచెప్పిరి. కాని వీరియుపదేశముల కామె యియ్యకొనినదికాదు. ఈవిషయమున పశ్చిమములోనున్న తనకు కావలసినవారును, మనదేశములోని కొందఱు వైద్యస్నేహితులును బలవంతపరచిరి. కాని యెల్లర ప్రయత్నములును నిష్ప్రయోజనములైనవి. తనకు

తొలుత తావలము నొసంగిన స్థానమునువదలి పోవుట కృతఘ్నతగానెంచి బోస్సారావీథియందే నిలదొక్కె. 'ఈవీథనన్ను స్వీకారము చేసుకొనినది. స్వీకరణమున నన్నుగైకొనిన ఈవీథికవదలి పోవ నాకు నిచ్చయేలేదు. పాదిని పెరిగిన మొలకకు పాదినివిడిచి పోవపాడియెగాదు. పుట్టుకనుండి మెంతుజలమిచ్చి వర్థిల్లజేసిన యీాల వాలంబువాసి, తల్లిబోలెతన్ను దారుణ్యమునకుదెచ్చు తనమూలంపు దేశమును బాసి, యాదేశమును తీక్ష్ణపు టెండలపాలుజేసి, యాజలంబుల నెండలమాడజేసి, ఛాయనివ్వమి పోకచెట్ల ధర్మమెకాదు; నరులకెట్ల పున్యాయము మాతృవిస్మరణ? చేత చేపట్టిపడిపిన చిన్ని పాపలంద రందమున పెద్దలయిచుట్టునుండ వారివిడిచి పోవ నీయమకు మనసురాామి వారినమనె కాలంబు గడపజొచ్చె, న్యాసంబుకై వశి తన కేలుజేరిన కార్యంబు మానుట నీయమ మతముకాదు. మాన్యుల బుద్ధులు చలనబద్ధములు కావు. మహిమవంతుల మనంబు హిమాచలంబు.

—ооо—

# నాలుగవ అధ్యాయము.

## గ్రంథరచన.

### మహనీయులు.

మహనీయులనేక విధముల మహత్త్వము జూపుదురు. పురుషులందు పుణ్యపురుషులువేరని వేమన చెప్పియున్నాడు. ఇందుకుపైగా పుణ్య పురుషులందు పెక్కువిధములుండు ననియు చెప్పవలసియున్నది.

### దశావతారములు.

మనవారికి ముఖ్యములైనవి దశావతారములు. వీనిలో నన్నియు యాదిదైవముయొక్క యంశమై యున్నను నొకదానింబోలు నవతారము మఱియొక్కటి లేదు. రాముని జీవితమునకును కృష్ణుని జీవితమునకును భేదము లనేకములుండు. రాముడు మితభాషియు, శాంతమూర్తియునై తనయాచరణచేతనే యుత్తమధర్మముల స్వభావము లోకంబునకుఁ దెలియజేసె. దండకారణ్యమునకు రాముడుపోయి యుంటయనౌచిత్యమని జాబాలిముని యాక్షేపించిన నాతనికి రాముడిచ్చిన

ప్రత్యుత్తరములే వాని మన స్తత్వమును బయలుపరచు చున్నవి. తన యభిప్రాయముల గూర్చి విశేషము ప్రసంగించు స్వభావము రామునియందులేదు. గూఢా కారేంగితుడని కాళిదాసుచే వర్ణితుండైన దిలీపుని వంశస్థుడు కదా రాముడు. ఇతనును గూఢాకారేంగి తుడే. కృష్ణుని బోధనస్వభావము రాముని యందు లేదు. పలుకరించినగాని రాముడు పలుకువాడుకాడు. కృష్ణునియందు శాంతత యొకింత తక్కువయు వాచా లత్వమెక్కువయు. భగవద్గీత నుపదేశించిన ఖ్యాతి యీతని జెందియున్నది. 'అహంసర్వం' అనుమాట ఇతనినోట వచ్చినదికాని రాముని నోట రాలేదు. బుద్ధునియందు బోధనాంశములు కృష్ణునియందుకన్న మెండు. లోకమునకు వయస్సు హెచ్చు కొలదియు నింగితవంతులసంఖ్యయు హెచ్చుచుండును. ఈకారణంబున కాలకాలమునకు ఉద్భవించుచుండు వాంశావతారంబులును తమధర్మబోధనల విశేషముగ వెల్లడి చేయవలసియుండు.

ఈకారణమున నివేదిత తనకుత్తమమని తోచిన ధర్మమునంతటిని గ్రంథముల తానేవ్రాసిపెట్టియున్నది.

తనకాలంబున తనసామీప్యముఁ బొంది తనబోధనల ఫలంబు నందలేనివారికిని, తన వెనుకవచ్చు వారికిని ఉపయోగపడుటకై తాను గనిన సత్యమునంతటిని గ్రంథముల నిమిడ్చిపోయె.

## గ్రంథములు, గ్రంథకర్తలు.

గ్రంథములకును గ్రంథకారకులకునుగల సంబంధ మొకింత యెఱుంగతగు. గ్రంథములవలన వానికారకుల ప్రభావస్వభావముల నెఱుంగగలుగుదుము. కాని, వానిని సంపూర్ణముగ నెఱుంగుట యసాధ్యము. గ్రంథముల వ్రాసినవారు తమచరితమున గ్రంథముల తాము పొగడిన ధర్మములు నంతటిని యాచరించిన వారై యుండవచ్చు. కొందరు వ్రాతల వీరులైనను చేతల శూరులుగాక భీరులై యుందురు. ఈయసంభావ్యత యిక్కాలపు మనదేశములోని యుపన్యాసకులలో మెండుగగందుము. ఉపన్యాసవేదికపై నిలిచి గంభీర స్వరములతోడి లోకోపకారమును గుఱించియు సంఘ సంస్కరణను గురించియు మాటాడువారనేకులు. వీరిలో తాముచెప్పిన బోధనలను నాచరించగలిగినవారు కను

స్వల్పము. వీరినిగన్న నొకవింతయైన కథమనసుకు వచ్చు చున్నది. విక్రమాదిత్యుని మరణాంతర మతనిసింహాస నముమీద కూర్చుండియున్నంతసేపును వెనుకటిరాజులు యుదారవచనములను పల్కుచుండిరనియు, దానకర్ణు లుగా నడచుకొనిరనియు ఆసింహాసనము విడిచి దిగిన వెంటనే విపరీతవచనములును బుద్ధులును పుట్టెననియు విందుము. మనయుపన్యాసములకుఁ గూడ యుపన్యాస వేదిక విక్రమార్క సింహాసనమై యున్నది. మరికొందరు తాముతమగ్రంథముల మూలమున నెంతటివారని చదు వరులకు కానవత్తురో, నంతకన్న నెక్కుడు ప్రభావము గలవారై యుందురు. తమ మనస్స్వభావమును బుద్ధి బలంబును వారి తల నిమిడ్పలేరు. ఇమిడ్చుటయును నసాధ్యమె.

రాముడు రావణునితో యుద్ధము చేయుచున్న సమయమున నొకపుడు రాముని కపజయభీతిగలిగె. అట్టిసమయమున నగస్త్యుడువచ్చి ఆదిత్యహృదయమను మహాస్తోత్రమునుపదేశించి " ఏనమాపత్సు కృచ్ఛ్రేషు, కాంతారేషు భయేషుచ । కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ" "ఓరాఘవా ! ఏపురుషుఁడై

నను ఆపత్కాలములయందు అరణ్యములయందు గాని, ఇతర భయస్థానములయందుఁగాని, ఈస్తోత్ర మును బఠించెనేని అతఁడు పరాభవమును పొందఁ"డని బోధించి జయశాలివి కమ్మని దీవించిపోయె. ఈఆదిత్య హృదయమున 'ఏష బ్రహ్మాచ, విష్ణుశ్చ శివస్స్కంధః ప్రజాపతిః మహేంద్రోధనదః కాలోయమః' అని సూర్యునిగురించి వర్ణించియున్నాడు. అనఁగా ఈసూ ర్యుడే బ్రహ్మయు, విష్ణువును, శివుఁడును, కుమార స్వామియుఁ, బ్రజాపతియు ఇంద్రుఁడునుఁ, గుబేరుఁడును, యముఁడును అగ్నియును యీతడేసుమా" ఇంత సమగ్రమైనవర్ణనను మరెచ్చటను సూర్యునిగురించిమన గ్రంథముల గనలేము. అయినను సూర్యునిగురించిన దానినంతయు వర్ణనలనిమిఁడ్ప నలవియా? సముద్రము నుగురించి యెంతటి వర్ణనముచేసినను దానిమహత్త్వ మువర్ణనవలన మాత్రమెఱుంగలేము. పంచభూతముల విషయము నిట్టిదే. నెవిర్ సర్ మిశ్రుడు అగ్నిగానెం గిన నివేదిత మహిమాతిశయములు వ్రాసిన గ్రంథము లమూలమునగాని యితరు లామెనుగురించి వ్రాసిన గ్రంథములవలనగాని పూర్తిగనెఱుంగలేము. మహాని

యుల మహిమయంతయును సమగ్రముగ గ్రంథముల
గానిపించజాలదు. అయినను వీరిగ్రంథములయందును
నుడువులయందును వీరిమాహాత్మ్యమును నెఱుగవ
చ్చును. గ్రంథములఁబట్టి గ్రంథకర్తలమనస్స్వభావప్రవృ
త్తులను నెఱుంగవచ్చు.

వాల్మీకి.

వాల్మీకి శ్రీమద్రామాయణమును రచించె. ఇందు
మూలమున నొక క్షత్రియ వంశజుఁడైన రాచబిడ్డ
యొక్క మహాబాహుబలంబును ధర్మనిరతత్వమును
సత్యసంధత్వమును, పితృవాక్యపరిపాలనమును, సత్య
సంధుఁడనుఖ్యాతి తండ్రిని చెందజేయు సముద్దేశమును, ధర్మ
బుద్ధిని, అసక్తవేదాంతి బుద్ధిని రాజసుఖనిరసనమును, రా
జ్యత్యాగమును, సవతితల్లులయందు యీర్ష్యాభావమే
గాక తల్లితోసమానమైనగౌరవము చూపుటయు,
లోకకంటకుఁడైన రావణుని పరిమార్చుటయు, లోక
వార్తయందు గౌరవముంచి ధర్మాపాయము గలుగ
కుండుటకై శుద్ధయనితానెఱింగిన తనభార్యను యడ
వులకు పంపుటయు, యింద్రియనిరోధమును, మితభాషి
త్వమును, నమితఘనకార్య సాధనశక్తియు, నీమహా

ముని కవిసింహుని మెప్పువడసినందునగాదె, యీమహావీరునిచరిత్ర మాత్రనిచే నసమానకావ్యరూపమున జీవితచరిత్రముగ వ్రాయబడినది. ఇందువలన గ్రంథకర్త యడపులనున్న మునియైనను లౌకికుడైన రాజుయొక్క గొప్ప గుణంబులను మెచ్చుకొని వానిం గొనియాడుచున్నాడనుట స్థాపితము. సజ్జనమన్న వాల్మీకిమతంబున కెట్టిదియను విషయము ఆయన రామాయణ రచన వలననే తెలియుచున్నది.

## వ్యాసుడు.

భారతమును రచించి యందు సకల ధర్మములను రాజనీతులను వానిసుస్వభావములను దుష్టస్వభావములను రెండుతెగలవారి మూలమున వర్ణించుటచే, ధర్మములనుం క్రోడీకరింపదగి వ్యాసుడను బిరుదునకర్హుండని తెలియుచున్నారము.

## కాళిదాసు.

కాళిదాసు రఘువంశము కుమారసంభవము మేఘసందేశము అనుకావ్యములను మాళవికాగ్నిమిత్రము విక్రమోర్వశీయము, శాకుంతలము అనునాటకములను,

వ్రాసియున్నాఁడు. అనాదిగ మనదేశమున షట్చక్ర వర్తుల పేర్లు ఎట్లు ఆదృతములై యున్నవో, యీ గ్రంథషట్కమునందలి గౌరవింపఁబడుచున్నవి.

రఘువంశము వ్రాయుటవలన, కాళిదాసుడు లోకనాథుఁడును, లోకపావనుఁడును పవిత్రతావతారము నైన సూర్యునియందు జన్మమందినట్టియు ఆజన్మశుద్ధులై నట్టియు, ఆఫలోదయకర్ములై నట్టియు, ఆసముద్రక్షితీశులై నట్టియు, ఆనాకరథవర్త్మః (స్వర్గమువరకు చను రథములగలవారు) లై నట్టియు, యథావిధి హుతాగ్ను (శాస్త్రరీతి నగ్నిహోమకరు) లై నట్టియు, అపరాధమునకు తగిన శిక్ష విధించు న్యాయమూర్తులై నట్టియు, రాజుల మహోన్నతికి తన మెప్పుమెండని చూపియున్నాఁడు. దానమిచ్చుటకుఁగానే వీరు ధనము చేర్చిరను విషయమును, సత్యమేపలుకుటకై మితభాషులై యుండిరను విషయమును యితని మెప్పు వడసినవి.

కుమార సంభవము వ్రాయుటవలన శివుని మనస్థైర్యమునకును పార్వతియొక్క భక్తిశ్రద్ధలకును తానాశ్చర్యము చెందినట్లు విశదపఱచియున్నాఁడు.

మేఘసందేశమువలన ఈతఁడు ప్రపంచానుభవంబు కలవాఁడనియు ఈతనికి శృంగార విషయముల వర్ణించుట లోనభిరుచియనియు తెల్లంబు. మేఘసందేశమును రఘువంశములోని కడపటిసర్గయు శృంగారరసపూరితములై యున్నవి. కాళిదాసుని నాటకములితనికి శృంగార రసమునందున్న చొరవను సూచించుచున్నవి.

భవభూతి.

ఉత్తరరామ చరితమును మహావీరచరితమును పట్టి చూచిన, వీనిగ్రంథకారుడైన భవభూతికి శోకరసమును వీరరసమును రుచించినవని తెలియనైయున్నది. ఈరీతిని గ్రంథములు గ్రంథకర్తల ప్రతిబింబములై యున్నవనిచెప్పవచ్చును.

కాళీతల్లి.

నివేదిత గ్రంథములంబట్టి నివేదిత మనస్తత్వము నెఱుంగుట కార్యము. ఈయమయొక్క ప్రథమ ప్రజ్ఞా శిశువు "కాళీతల్లి". ఈనామంపు గ్రంథమును 1900 సంవత్సరమున నింగ్లాండు దేశములోని యొకగ్రంథప్రకటన స్థానమువారిచే నీయమప్రచురింపించినది. ఈచిన్న పుస్తకములో కాళీస్వభావమును నీయమ విశద పఱచి

యున్నది. కాళీదేవి రక్తమాంసాపేక్షిణియైన నొక క్రూర దేవతయని యనేకుల యభిప్రాయమైయున్నది. అట్టివారికీగ్రంథమున నపూర్వమైన సంగతులు కొన్ని దొరకును.

గుడి.

ఈయమ యీగ్రంథమును వ్రాయుట మనకొక పాఠమును చెప్పించినట్లు. మనవారికి గుడియన్న నచట యుండెడి రాతిగోడలును గోపురములును, దైవమన్న యీగుడిలోని విగ్రమే యనియు మూఢ విశ్వాసము పాటిల్లియున్నది. చదువుకొనినవారికికూడ యింతటియభి ప్రాయమేయున్నది. దీర్ఘాలోచనచేసి, గుడిలోనివిగ్రహము దేవునిగూర్చి మనవారికున్న యభిప్రాయమని నెరుం గుటలేదు. మూఢులును చదువుకొననివారును యీ యభిప్రాయముల పాలై యుండుట సహజమే. కాని చదువుకొనిన వారుకూడ యిట్టియభిప్రాయమే కల వారై, విగ్రహారాధన నిగ్రహింపవలసినదని కంఠములు చీల్చుకొని చెప్పియున్నారు. ఇట్లు చెప్పువారికి మానవ మనస్స్వభావమే బొత్తుగ తెలియదని రూఢిగచెప్పవలసి యున్నది. ఒకడు తనకున్న జ్ఞానమును నభిప్రాయము

లను గ్రంథముగాజేసి బెట్టిపోయిన తరువాతి వారా గ్రంథము నేమిగానెంచవలె. గ్రంథకారుని యభిప్రాయములుగా నెంచవలె. ఆయభిప్రాయముల సరియైన వానిని గైకొనవలె; లేక, విడచి పెట్టవలె. గ్రంథమును మనము చదివి యందుల భావవిమర్శనము చేయుట యుక్తమా, లేక, కాగితముల కట్టయందేమియున్నదని దాని కాల్చివేయవలెనా ?

విగ్రహారాధన.

విగ్రహారాధన త్రోసివేయుమనువారును దేవాలయముల పడగొట్టువారును తొలుత దేశములోని గ్రంథములన్నిటిని కాల్చివేసి తమయభిప్రాయమును స్థాపించిన తరువాత వీనినాశనకార్యమును గైకొనవచ్చు. వీరుచెప్పిన దెట్లున్నదన, అమరము చదువువాడొకడు, ప్రథమకాండతనకు వల్లింపవచ్చిన కారణమున, లోకములోని యమరగ్రంథములనుండు ప్రథమకాండ పుటలన్నిటిని చించివేసి యగ్నికాహుతి యియ్యమని చెప్పినట్లు.

దైవస్తోత్రము.

మరియొక విషయ మాలోచింతము. ఈయభిప్రాయముల గలవారు దేవుని నెరుంగ విగ్రహము

లనవసరములనియు, వానివలన చెడుగుకలుగు ననియు చెప్పుదురు. స్తోత్రములఁ బుస్తకములనుంచి చదివియు, తాళమృదంగముల సహాయమున దేవునిస్తోత్ర కీర్తనల పాడవలెననియు నభిప్రాయపడి యీపద్ధతులుత్తమము లని చెప్పి వానిని యాచరించుచున్నారు. వారాచరిం చిన వలదనువారులేరు. వారిదకుంఠితమార్గమనియెంచి, లోకముననుండితర మార్గము లన్నియు హేయములని యెంచి వానిని దూషించుట యెట్టి న్యాయము? దేవుడేలేడనియు, దేవుడున్నాడో లేడో యను విషయ మును తర్కించుట కాలయాపనయనియు, పూజల యందును ప్రార్థనలయందును రోజుకు రెండుగంటల కాలముపలవ్యర్థపుచ్చవలెననియు, సర్వజనులకు మంచి చేయుచు, వారికష్టములయందు వారికి తోడ్పడిమన చేతనైనంత సహాయము చేసి వారికి మేలుగావించవలె ననియు, 'నాకదిలేదు యిదిలేదు దానినిమ్ము దీని నిమ్ము దైవమా' యనివేడుటచే మనకేమియులేదను భావంబుకలిగి బుద్ధియు దేహమును బలహీనమగు ననియు చెప్పువారును నట్లె యాచరించువారును కొంద రున్నారు. సూర్గరెట్టు శ్రీరామకృష్ణ శిష్యావళిలో

చేరి నివేదిత యయ్యెడుకు పూర్వమీమాంసయు నీయభిప్రా యములనే దృఢముగ గలిగియుండినది. అట్టివారు మృదంగాదివాద్యముల నండఁబెట్టుకొని దేవుని సంకీర్తనము చేయబూనువారిని దూరి వారిమృదంగముల పగులఁగొట్టి, తాళముల చేతులనుండి పెరికి పారవైచినను, స్తోత్రపాఠపుస్తకముల చించి పనసుని పాలు చేసినను నదియెంతటి న్యాయముగా నీవిగ్రహారాధన దూరులకు కానబడును? సుఖమనుభవించు విషయమున మనమును లోకము నొకటియనియెంచి, మనము మనకై యెంతచేసుకొందుమో లోకులకు నంతచేయుట శ్లాఘ్యముగాని, బుద్ధిబలవిషయమున మనబుద్ధియు లోకుల యెల్లరబుద్ధియు నొకటియె యనియెంచి, మన ధ్యాన పద్ధతులను నెల్లరు నవలంబించవలయుననుట కేవలము మౌఢ్యము. సర్వాంకష ప్రజ్ఞగలిగి, తత్త్వముల సారమును గ్రహించి సమాధినిసత్త్వమువడయు ధీమంతులకు వృక్షములను శిలలను జలములను నక్షత్రములను సూర్యచంద్రులను, విగ్రహములను బాధ పశు మృగములను మానవులను నెవ్వరినిగన్నను దైవాంశమనియు, లేక తమయంశమే యనియునెంచి,

వారిని పూజించుట, లేక వారిసేవచేయుట నైజమయి యున్నది. వీరువిగ్రహములు తమను కావలెననుట లేదు. విగ్రహములు నాశనము చేయవలెనను దార్ఢ్యము వీరియందులేదు.

విగ్రహవిమర్శన.

నివేదిత యిట్టివారిలో చేరదగిన బుద్ధిభాగ్యంబు గలదై 'కాళీ' విగ్రహమును చూచినదాది చాలకాలము 'కాళీ' స్వభావమును గురించి తనలోననే విత్కరించి యాఫలంబుగ నీగ్రంథమును వ్రాసినది. విగ్రహముల యంతర్భావమును గూర్చి విచారించుస్వభావము మనవారి కనేకులకులేదు. వారికినేర్పించువారును లేరు.

విష్ణువు.

పండితులు గుడిబైటకాని లోపలకాని, విష్ణువు అనుపదమునకు వ్యాఖ్యతోటి రెండు గంటలకాలమర్థముచెప్పుచు వ్యాసమివ్వగలరు. భూదేవి, శ్రీదేవి యనినను నట్లే వ్యాఖ్యాసహితముగా యర్థము చెప్ప

శక్తి వీరికుండును. కానిగుడిలోనికి వెళ్లి పడుపడగల పాముపైన కిరీటముధరించియు పైభాగమున బొడ్డునకు సరిగ నాలుగుతలల వాడయ్యు పద్మముమీదకూర్చుండియుండు బ్రహ్మమూర్తి మొదలైన పరిజనములతోటి గూడుకొనియున్న విగ్రహమును చూచినపుడు తమ పాండిత్యము నంతటినిమరచి, తామిచ్చు టెంకాయ కర్పూరములపై కన్నులునిల్పి తమకిచ్చుతీర్థములను తులసిదళములనే ధ్యానభాజనములుగ జేయుచున్నారు. ఈపండుకొనియున్న విగ్రహమునకు ముందునిలిచియుండువిగ్రహము చలవిష్ణువనితెలుపు. ఒకవైపు శ్రీదేవియు, మరియొకవైపు భూదేవియు, నిల్చియున్న, వీరుఇద్దరు స్త్రీలుగారు. సమస్తభూతములయందుండు ప్రాణము విష్ణువుగాను, యీప్రాణముతోచేరి దానివిస్ఫురణ కాధారమైయుండుభూమినే మనవారు కవితా చాతుర్యమున భూదేవిగాను, శిల్పచాతుర్యమున స్త్రీ విగ్రహముగాను వర్ణించి యున్నారు. శ్రీదేవియన లక్ష్మి. సర్వవ్యాపియై విష్ణువను నామమున బరగు నమ్మహాప్రాణము భూదేవితోడను, వస్తురూపమున నుండు శ్రీదేవితోడను వర్తిల్లుచున్నదను విషయము నెఱుంగుట కష్టమైయున్నది.

### శివుడు.

అర్థనారీశ్వరవిగ్రహముం గన్నపుడు స్త్రీపుంస్త్వములసమ్మేళనమైన నీప్రకృతియొక్కయు విష్ణువుయొక్కయు స్వరూపము శివునియందు కంపుమనుటయు, యీమొదలైనవిషయములను విగ్రహములఁజూచినపుడు మోచించవలసియున్నది. విగ్రహావిమర్శనము నివేదితకుండె. ఇట్టిశక్తివిమనము మనదేశములోని భక్తులనెడకందుము. వేదాంతదేశికులు వెంకటేశ్వర స్వభావమును గురించి వ్రాసియున్నారు. ఇంకను ననేకభక్తులు దక్షిణదేశములోని యీమూర్తివిగ్రహముల యంతర్భావముల పేర్కొని, దైవాంశములను తెలియంజెప్పియున్నారు.

### శైలి.

ఈగ్రంథమందలి ఈమెయొక్క శైలి ప్రశస్తమయినదై నీలాద్రిశిఖరములనుండి నిలువక స్రవించుచుండు వెండితీగెలఁబోలి జలధారలవలె స్వచ్ఛమై మనంబునాకర్షించు పదములు శుద్ధములు, వాక్యములాకర్షకములు.

ఈయన యీగ్రంథమును వ్రాయు టెంతయు నుచితము. ప్లేగు మొదలైన మారకజాడ్యములు కాళికాదేవియొక్క రోగులనియు, యాదేవికి యాహారము మొదుగ నందనపుడు జనులనెడ క్రోధముపూని నాశనము చేయుననియు నభిప్రాయము కొందఱికి కలదు. కాళియని యెంచబడు ప్లేగుజాడ్య మొకవైపున నరారణ్యమునునరుకుచుండ, నిస్సీమకరుణారస యుక్తమై, ప్లేగు పెదవులచిక్కినవారిని వీరధైర్యముతో తప్పించిన నీమెయిట్టి గ్రంథమునువ్రాయుట యనుచితము కాదు. కాళియొక్క క్రూరస్వభావము ప్లేగురూపమునకలకత్తాలోనొకప్రక్కన విజృంభించుచుండ, కరుణారసము నివేదితరూపమున శుద్ధధవళవస్త్రముధరించి యుపచర్యలుగావించుచు తిరుగుచుండెనో యనునట్లుండు. కాళికాస్వభావమును నీకరుణామూర్తి యీగ్రంథము నవిశదపఱచియున్నది.

"హింద్వాచారములయల్లిక."

ఈయనయొక్క ముఖ్యగ్రంథముపేరు "వెబ్ ఆఫ్ ఇండియన్ లైఫ్ (హింద్వాచారములయల్లిక)" దీనియందు మనధర్మముల ఆచారముల పరస్పరసంబంధ

మును, యీధర్మములలోను నాచారములలోను నొండొంటికున్న పరస్పర సంబంధమును నిరూపించియున్నది. విశేషముగ చెప్పనక్కరలేదు. ఇంగ్లీషు భాషలో మనదేశ విషయకమైన గ్రంథములలో దీనికి సమానమైన గ్రంథములేదు.

మనధర్మంబుల భావంబులను వానియుద్దేశములను క్రొత్తగ నీగ్రంథమువలన నెరుగనైయున్నది. మనభాషలలోని గ్రంథములుకూడ మనధర్మములను నాచారములనుపేర్కొనుచున్నవి. మనధర్మములపై నీయమ చేయవ్రాసిన వ్యాఖ్యానమయమైన యీగ్రంథము మిక్కిలియు నాదరణీయము. మనపండితులు మనధర్మబోధకగ్రంథములచదివి వాటిపై శబ్దవ్యాఖ్యల నొనర్చిన, నీయమ మనయాచారంబుల మూలమున మనధర్మములచదివి వానిపై తత్త్వవ్యాఖ్యల తనగ్రంథముల వ్రాసియున్నది. అట్టి గ్రంథములలో నిది వన్నెకెక్కినది. మన వేదాంతగ్రంథములు మనదైవజ్ఞానము క్రోడీకరించుచున్నవి. మనశాస్త్రిగ్రంథములు మన దినచర్యలవిధిని చెప్పుచున్నవి. కాని వీటిలోని

గూఢభావముల వెలిదీయుగ్రంథమునుగాని గ్రంథకారునిగాని మనదేశమిప్పటికి బడసినదికాదు.

## నివేదిత స్మృతికర్త్రి.

మనభాషలం దనేకస్మృతులున్నయవి. మనువు తనకాలమున మనుస్మృతిని వ్రాసిపెట్టిపోయె. పరాశరులు, యాజ్ఞవల్క్యులు మొదలైనవారు సంఘక్షేమమును లోకక్షేమమునుగోరి వారివారి కాలములన్వృద్ధిజెందియున్న యధర్మములను, దురాచారములనుసంఘమున కక్షేమకరంబులనియెంచి ప్రబుద్ధమనస్కులై స్మృతులవ్రాసిరి. బాగుగచదివిచూచిన పైవారువ్రాసిన స్మృతులలో కొంతకొంతభేదములుండును. ఈభేదంబులకు కారణంబులు కాలభేదంబులె. మనకుధర్మవిషయముల సందేహంబులు పొడమినపుడు వీనినన్నిటిని శోధించివీనిలోతగుమైన దానిని ఆధారముగ తీసుకొనుచున్నాము.

ఈకాలమునకు గొప్పస్మృతి నివేదితాతాపసివలన మనకు ప్రాప్తంబయినది. కాలస్వభావమును పట్టియు మనదేశస్త్రీల దుస్థితినిబట్టియు మనకీస్మృతికారిణియ

న్య దేశములనుండి రావలసియుండె. అన్యదేశాగత యయినను మనదేశీయుడై సనాతనధర్మము పేరబ రగు యార్యధర్మసత్త్వసారముయొక్క మూర్తియని చెప్పందగిన వివేకానందులయుపదేశము లీమెకుమార్గం బుచూపుటచే యిక్కాలమునకు మనదేశమున కావ శ్యకమైనస్మృతి, యిక్కాలమున లోకమునకు ప్రధాన మైనట్టియు హిందూదేశము నంతటికిని సామాన్యము నునైనఇంగ్లీషుభాషలోన, ఈమెయందుజనన మొందినది. ఈయమవ్రాసినవన్నియు మనకు స్మృతికల్పములేకాని యందుల కెంతమాత్రముతగ్గినవికావు. యాజ్ఞవల్క్య పు, పరాశరుడు మొదలైన స్మృతికారకుల నామముల తోడియు గౌతమి, గార్గి, అనసూయాది తాపసస్త్రీల నామములతోడియు నీయమ నామంబు చేర్చఁదగి యున్నది. 'వెబ్ ఆఫ్ ఇండియన్ లైఫ్' అనుపేరుగల్గిపైని నిమస్సింపబడిన గ్రంథముయీమెయొక్క ముఖ్యస్మృతి.

" స్వామిని నేగన్నవిధము. "

వివేకానందుల యుపదేశములను, వారిచరిత్రము హిములను వాస్తవరీతిని నెఱుంగగోరిన, నివేదిత వారి

జీవితము పై నివ్యాఖ్యానంబు బోలె వ్రాసిన 'స్వామిని నేగన్నవిధము' అనుగ్రంథమును మనము చదువనగు. ఇది శుద్ధసత్త్వవంతుడైన యొకమహనీయుని గురించిన సర్వస్వమును మరియొక యగాధమతి యేకాగ్రబుద్ధితో గమనించిచూచి యక్షరముల నిమిడ్చచేసిన ప్రయత్న మేకాని వేరుకాదు.

### అజంతాప్రతిమలు.

అజంతాగుహలను పేరప్రసిద్ధికెక్కిన గుహలుకొన్ని హైదరాబాదు నవాబుగారి రాజ్యములోనున్నవి. వాని యందనేక చిత్రములు వర్ణములతోడ వ్రాయబడి యున్నవి. వీనిలో బుద్ధుని ప్రతిమలు అనేకములుగలవు. ఒకచోట 10అడుగుల యెత్తుగలబుద్ధుని ప్రతిమయుండు, కొందరుభక్తులు మోకాలిపై నూని కూర్చుండిపందన మాచరించినట్లు వ్రాసియున్నది. ఈగ్రంథమును చదివిన మనకు ఈకటను జ్ఞాపకమునకువచ్చు. వివేకానందులు బుద్ధునికిని నివేదిత భక్తురాలికిని సరిపోదురు. అమెరికాలో వివేకానందులు తమయుపన్యాసప్రభలచే నచ్చటివారికి సూర్యుడో యనునంతగౌరవమును పుట్టించిన కాల

మున కొన్ని పత్రికలాయనకు బుద్ధునివంటి ముఖమాం డినదని కొనియాడియున్నవి. అంతటిభక్తియు తదేకధ్యా నమును నీమెయీగ్రంథమునఁ జూపియున్నది.

బాస్వెల్.

ఈగ్రంథమున వీరిరువురికున్న పరస్పరగౌరవములకు నిదర్శనమొకటి చెప్పనైయున్నది. ఇంగ్లెండులో డాక్ట ర్ జాన్సన్ అనుపేరుగల నొకగొప్పగ్రంథకారుడుండెను. ఇతఁడు చాలప్రతిష్ఠావంతుడు. అనేకఉత్కృష్టగ్రంథ ముల వ్రాసినవాఁడు. ఆంగ్లేయకవుల జీవితముల విమ ర్శనతోడి తొలుతవ్రాసినఖ్యాతి నీతనిఁజెందియున్నది. సమకాలికపు జనులలోని లోపములగ్రహించి వానిని గురించి పరిహాసగర్భములైన వ్యాసములను నితఁడు వ్రాసియున్నాఁడు. ఈతని చర్యలలోను నుడులలోను కొన్నివిశేషము లుండుటంబట్టి బాస్వెల్ అనునతడు యీతని జీవచరిత్రమును సమగ్రముగవ్రాసెను. జీవిత లేఖకులలో నీతనికిసమానులు లేరని యనేకులయభిప్రా యమైయున్నది. బాస్వెల్‌కు జాన్సన్ పూజాపాత్రు డుగనుండెను. జాన్సనుయొక్క ప్రతిచర్యను మాటను

అత్యాదరముతోను ప్రీతిగౌరవ యుక్తముగాను గమనించి వానిలోని ప్రత్యంశమును జాన్సనుయొక్క యేగుణములనెట్లు ప్రచురించినదియు సూచించుచు ఈతఁడు ఈజీవితమును వ్రాసియున్నాఁడు.

నివేదితమదికి వివేకానందు లమేయప్రతిభావంతు లని తోఁచినట్లు పెక్కుచోటుల వ్రాసియున్నది. అట్టి మహిమార్ణవమున నేసమయమున నెట్టినురుఁగులను నలలు పుట్టునోవానిని గమనించియూహాతో నర్థముచే సుకొన సదా యీయమ ప్రయత్నించుచుండెను. మన మొక్కనది నూతనముగ వరదంబడసిన, దానియొద్దను ప్రవాహ గాంభీర్యమును చూచి యానందించుచు, అందుమెట్టిమెట్టి త్రెళ్లింపులును నెంతెంతటి సుళ్లునుపుట్టునోవానిని చూడ ననన్యచిత్తులమై నిరీక్షించుచుందుమో, అట్లే నివేదితకూడ వివేకానందులచెంత నిలిచి కాచియుండను. ఏసమయమునవెట్టి యమూల్యంపువచనములు వీరిమనఃప్రవృత్తి ప్రవాహమునుండి బయలు దేరునో మెఱిఁగి యానందింపఁ నీమెగాచియుండునది.

" స్వామినినేగన్నవిధము "ను మనము చెప్పునప్పుడు మనకు వివేకానందులను జ్ఞానమునకు నివేదిత యొకబాస్వెల్లుగా యుండెనని తోచును. సూర్యుని తేజము చంద్రునినంటి ప్రతిఫలించుభంగి వివేకానందుల జీవితమహిమ నివేదితయను చందమామను సోకి యీమె గ్రంథరూపమైన చంద్రికగాఁ బ్రకాశించెను.

వివేకానందులు, ఒకపాణినిసూత్రము.

వివేకానందుల జీవితమత్యల్పకాలికము; అయినను పరిమితిలేని శక్తియుతమును, ఉద్యమవంతమునై యుండె. పాణినివ్యాకరణములోని సూత్రములు బహు హ్రస్వములైనను మహదర్థగర్భములై యుండు. వానికి వ్యాఖ్యానము లావశ్యకములై యుండు. అట్లేయీ గ్రంథము వివేకానందుల జీవితమను సూత్రముపైని వ్యాఖ్యానమనదగియున్నది.

ఇంకను కొన్నిగ్రంథములనీయమ వ్రాసియున్నది. వానియందలి విషయములు చాలముఖ్యములైనవి. వానినిగురించి యీమెవ్రాయుపద్ధతియు ప్రశస్తమయినదే.

## కవిప్రతిభ.

ఈయమకు కవిప్రతిభ విశేషముకలదు. కవిప్రతిభ యననెట్టిది? విశ్వాంశములయందు ప్రత్యణువునందును జీవమున్నట్లు కవులకుదోచు. సమాధికల్పన వీరి శిల్పము. పురూరవుఁడు ఊర్వశిని వెదకికొనుచు అడవిలో తిరుగునపుడు అతనికిరుపార్శ్వములనున్న చెట్లమండలు రాజునకు చామరములుగా వీచెనని కాళిదాసుఁడు చెప్పియున్నాఁడు. సామాన్యుల కచేతనంబులనితోచునవి కవులకు సచేతనంబులు. ఈప్రతిభ నివేదితయందు మెండుగనున్నది.

ఈమె గ్రంథములయందు సమస్తవిషయముల గురించి చెప్పవచ్చును. మనధర్మముల మాహాత్మ్యమీమె వర్ణించినట్లు మరియొకరీకాలమున వర్ణించినవారులేరు. మనదేశచరిత్ర కరణమునుగురించి యీయమ తనగ్రంథములయందు చూపినయాసక్తియు యోచనా కుశలతయు నిరుపమానములు. మనశిల్పశాస్త్రముల ఉద్ధరణమును గురించి చాలశ్రద్ధచూపుచు వ్రాసియున్నది. ఈవిషయమున శ్రద్ధనేగాక విమర్శన

శక్తినిగూడ విశేషముగఁ జూపుచు వ్రాసియున్నది. వస్తుప్రదర్శనశాలలోనుండు పూర్వపుశిలాప్రతిమలలోపాలోపములనుగూర్చి యసమానపద్ధతిని వ్రాసియున్నది. టాజ్‌మహల్లను భవనమణినిగూర్చి యతి ప్రౌఢముగ వ్రాసియున్నది. ఇంతయేల? మనదేశమునకు సంబంధించిన ప్రతివిషయమును గురించి యీమె వ్రాసియున్నది.

విద్యార్థిస్వభావము.

విద్యార్థులలోను గ్రంథపాఠకులలోను నొకస్వభావముకలదు. ఒక్కొకరికిచిన్ననాటినుండియు నొక్కొక్క గ్రంథము విశేషపరిచితమైయుండు. ఒకరుచదివిన గ్రంథమును నంతటిశ్రద్ధతో మరియొకరు చదివియుండఁజాలరు. ఒకగ్రంథమును లెస్సచదివినవాఁడు దానిని విశేషప్రీతితో నాదరించును. దీనివిషయమై విశేషముగా స్తోత్రముచేయుచుండు. వానియంతటి శ్రద్ధతో చదువనివారికిని బొత్తుగచదువనివారికిని నాగ్రంథమందంతటి గౌరవముండదు. ఆగ్రంథములవిషయమై వారుచేయు స్తోత్రముల వీరామోదింపగలుగుట యరుదు. కొంత కాలమునకు వీరును అంతటి యాదరమును చూపించు స్థితికివత్తురు.

నివేదిత గ్రంథములు విషయమున వానింజదివిన వారికి గలుగు గౌరవకారణంబున వానిస్తోత్రము చేయుట న్యాయము. వానిచదువని వారిస్తోత్రముల నామోదింపఁజాలరు. ఒకనాటికిని నీయమగ్రంథములు ప్రాతపడవు. సూర్యునివలెనివి తమతేజంబువలనఁ బ్రకాశించు. ఇందలి సూక్ష్మదృష్టి యెల్లకాలంబులకును మార్గదాయకంబగు. హిందూదేశమునకు నివేదితగా చరించి తుదను మృత్యుదేవతకు నివేదితమై ప్రత్యక్షమయ్యె నప్రత్యక్షురాయెను నాదేవతనోట ఈమెకబళమై పోయినను ఈయమగ్రంథము లీమెపేరును కాలకాలంబులకు నిల్పగలవు. ఈయమ 1912 సంవత్సరమున వ్యాధిగ్రస్తురాలై చనిపోయెను.

## శైలి.

ఈయమ శైలి కొన్నివిషయముల నసమానము. ఈమె గ్రంథముల చేతనెత్తిచదువ నారంభించిన మనస్సంతయు గ్రంథవిషయమున లీనమైపోవును. పదముల కూర్పును, వాక్యపటుత్వములును కొంతయసాధారణములై ప్రయత్నముచేతగాని కొన్నిచోట్ల యర్థము

గావు. ఇట్టిభాగముల పెక్కుచోటులయందు ఈయమ తాను చెప్పగోరినవిషయముల చెప్పువిధమే నవీనమై యుండు. ఈరెండు కారణములచేతను మన మనములు అనన్యసక్తములై యుండ ప్రయత్నించు. ఈప్రయత్నమువలన, చదివి కష్టముతోటి యర్థముచేసుకొనఁబడిన విషయములు మనమున ముద్రితములై శ్రీవైష్ణవుల చక్రాంకితములభంగి శాశ్వతములై నిల్చు. ఈమె యెట్లు తన బుద్ధియంతరాళమునుండి పటుత్వముతో వ్రాయునో నంతటి పటుత్వముతో ఈమెచెప్పునంశములు మనబుద్ధియంతరాళము జొచ్చియుండు. సుగ్రీవునిచే జరుపబడిన సాలభంజన పరీక్షయందు రాముని బాణము లేడుసాలముల వానిదూఱిపోయి వెనుకటి భూమిలోనినాటిన ట్లీయమ నుడులును లిఖితములును మనమనంబుల జొచ్చు.



# అయిదవ అధ్యాయము.

## అభిప్రాయములు.

### ధర్మస్వరూపము.

హిందువులచే వేలవేల సంవత్సరముల క్రిందట నియమింపబడిన ధర్మములనేకము లిప్పటికిని నడచుచున్నయవి. కాలము చాలమారినను యివిమారినవి కావు. ఆకాలపు స్థితికి తగినట్లు, యీధర్మములనప్పటి వారు నియమించుకొనిరి. కొన్నికొన్ని వానిలో శ్లాఘ్యములుగా నున్నవి. అదేల? అనేకములు శ్లాఘ్యములు గానేయున్నవి. కొన్నిమాత్రము ఈకాలమునకు తగినట్లు మార్పు జెందవలసినవై యున్నవి వానిని మార్చుకొనకున్న దేశము హీనస్థితికి దిగిపోవును. ఉదాహరణము: సముద్రయానము బ్రాహ్మణులకు కూడదని దైవవిధిగా పూర్వపు హిందువులు నమ్మియుండిరి. బ్రాహ్మణులు సముద్రయాన మొనరించిన ప్రాయశ్చిత్తము చేసుకొనవలసినదిగా నెంచియుండిరి. సముద్రయానము చేయకున్నను దేశమునకు వారికిని

హాని యేమియు జరుగనికాలంబున నెగడినయీధర్మము యీకాలంబునకుఁ దగినదికాదు. కాలానుగుణ్యముగా ధర్మముల మార్చుకొనకున్న మనమును దేశమును కంత టికిని చేటుతప్పక వాటిల్లును.

ఆచారములు.

ధర్మముల కొన్నిటిని మార్చుకొనిన బాగుగనుండు నని చెప్పినంతటనే యెల్ల ధర్మములను మార్చుకొన వలెనను బుద్ధికి పాలు గాకూడదు. పాశ్చాత్త్యుల ధర్మములలో శ్లాఘ్యముల కొన్నిటిమనము గ్రహించిన వానినాచరించు పద్ధతిని కూడ నల్లె యవలంబింప గూడదు. ఉదాహరణము. ప్రౌఢవివాహములితర దేశములయందు బలవంతులైనజనులను వృద్ధిపఱచు చున్నవి. ఇదివాస్తవమే. మనదేశమందు శైశవివా హము లనేకములు జరుగుచున్నవి. ఈ యాచారము వలన కీడులనేకములు సంభవించుచున్నవనుటవిశదమే. ప్రౌఢవివాహముల నాచరించు దేశములలో శిశువు లారోగ్యవంతులుగాను, బాలబాలికు లుత్సాహవంతు లుగాను, యౌవనవంతులు ధైర్యస్థైర్యములు గలవారు

గనుండి వారి బంధువులకును మిత్రులకును సుఖసంతో
షముల నెుసగుచున్నారు, చిరంజీవులయి యున్నారు.

మన దేశముననన్ననో, శిశువివాహంబుల ఫలంబుగ శిశువులు దుర్బలులును, బాలబాలికలు నిరుత్సాహులును, ప్రౌఢులుప్రక్క యెముకల వెలుపల వేసుకొన్న వారుగను, ఉన్నారు. ఇట్టివారికి తమకు సంతోషము లేదు. వారివలన బంధువులకు బలములేదు. దేశమునకు దోర్బలములేక దౌర్బల్యమె కలుగుచున్నది.

ఇట్టిసందర్భమున, మనమును ప్రౌఢవివాహాచారము నవలంబించిన బాగు. కాని యాచరించ వలసిన పద్ధతివేఱు. ప్రకృతపు బాశ్చాత్యాచారములు ప్రకారము కుమారకుమారికలకు వివాహముచేయు బాధ్యత జననీజనకులయందు లేక వధూవరులయందే ప్రతిష్ఠితమైయున్నది. అందువలన పాశ్చాత్యులలో, బీదలైన స్త్రీలు వరుని బడయకయే, వివాహమనుదాని నెఱుగకయే జీవించుచున్నారు. ఇంగ్లండు మొదలగు దేశముల యందిట్టివారిసంఖ్య వేనవేలై యున్నది. ఈయనర్థముల బాగుగ గమనించి ఏపద్ధతి నవలంబించిన

యెడల నిట్టిలోపములులేక, ఇష్టసిద్ధిచేకూరునో అట్టి మార్గముల నవలంబించుట దేశాభిమానులకుఁ గర్తవ్యము.

## స్త్రీవిద్య.

ఈయమ ముఖ్యముగా పరిశ్రమచేసినది మనదేశ స్త్రీజన విషయముననె. గురువుగారైన వివేకానందుల కోరికెయు నదియేయయియుండె. చంద్రుడెల్ల భూతంబులకు సంతోషమును కలుగజేయు. అయినను కలువలను విప్పుశక్తి యతనికేకదాయున్నది.

మనలో నెంతమంది 'తొట్లయూచు చేయిధరణి నేలు'అను వచనంబుయొక్క సారము సమగ్రముగాగ్రహించియుందుము?

హిందూదేశ స్త్రీలస్థితి చాల లోపయుక్తమై యున్నదను నమ్మికయొకటి బాహ్యదేశముల నాటి యున్నది. అనేకులీదుస్థితికి చదువులేమియే కారణంబని యెంచి చదువు చెప్పించిన నన్నిలోపములును బాసి పోవునని వారినమ్మిక.

మన స్త్రీలకెట్టి చదువును చెప్పదగు ? వారిజీవిత ధర్మంబులెవ్వి? వానిని నిలుపుకొని యిక్కాలమునకు

తగినట్టువానిని మార్చుకొని వృద్ధిపఱుపనెట్టి విద్యప్రశ స్తము? ఆవిద్యను గఱపుమార్గములెవ్వి? అనునీవిషయ ములగురించి యాక్షేపణీయములుకాని యభిప్రాయ ములింకను వెలువడినవికావు.

ఇంగ్లండులోనున్నపుడీయమ విద్యావిషయమై గొప్ప శ్రద్ధవహించి యనేక నూతన విద్యా దానపద్ధతుల నవలంబింప ప్రయత్నించుచుండె. హిం దూదేశమున నీమె యవలంబించిన మార్గములుగౌరవ నీయములై యున్నవి. కలకత్తాలో ఈమెనివసించు చుండిన 14 వత్సరములును తనయింట బాలికల కును, వృద్ధస్త్రీలకును వారివారికి తగుమైన మార్గం బులవిద్యగరపియున్నది. ఏవయస్సునున్న వారికి వారికె తగినమార్గంబు నవలంబించె. ఏమార్గము నవలంబించి నను యీమెయొక్క మొదటిపని యేమన వారిబుద్ధిని మేలుకొలిపి వారికి ధర్మబుద్ధిని గరపుటయే.

ఇందులకామె పన్నిన యుపాయములెవ్వి? బుద్ధిని మేలుకొలుపు విషయమున చరిత్రయొక్క సహాయము నీమె చాలగైకొనె. సజ్జీవితుల చరిత్ర శ్రవణంబున

వీరెనందరిని ముంచిపెట్టె. విరామములేకయట్టివారి జీవితముల వీరిమరంబుల కెక్కించిన 'భ్రమర కీటక న్యాయంబున' వీరునట్టివారుగా నుండనో పుచుఁను నది యీయమయొక్క గొప్పనమ్మిక.

చరిత్రయన్న రాజరాజ్యముల చరిత్రములే కావు. యుద్ధములేకావు. సంధిసమాధానములేకావు. వీనిని గురించియు నీమెయుపేక్షచేసినదిలేదు. కాని వీనియం దలి యీయూరాజుల మనస్స్వభావముల విమర్శించి దానిబయటికిదీసి తెలియజెప్పు. ఇంతకన్న మహాపు రుషులజీవితములును మహాస్త్రీల జీవితములునునీమెను గౌరవాస్పదంబులై, విద్యాదాన పద్ధతులకు సహాయ కారిణులుగా నుండినవి.

ఇందులకై యీయమ మన పురాణములలోని కథలఁబోల్కొని, బాలికలకు తగినవానినివారికిని, వృద్ధు లకు తగినవానిని వారికిని నొక్కిచెప్పుచుండు.

నేత్రేంద్రియమున కన్న శ్రోత్రేంద్రియమును నీమెయెక్కుడుగ జ్ఞానప్రవేశమార్గముగ గావించె. ఈక

థల నీమె చెప్పినప్పుడు వానికిగల పటుత్వమే వేరు. ఆమె కథలచెప్పునపుడు కథలకాలంబునందు మనమనంబును గొనిపోయి, కథలోని నొకరివలెనో లేక తొలుతయాచరితము మెచ్చుకొని వ్రాయఁబూనిన కథాకారకుని యున్నంత తన్మయతతోఁ కథలఁజెప్పు. ఈకారణంబున కథాంశములును, వానివలన నీమె విశదపరుపదలంచిన ధర్మములును, శ్రోతలమనంబున ముద్రితములై యుండు.

సీతకథను చెప్పునపుడు రాముడడవికి పోవలసివచ్చి పోయెదనని చెప్పి పోఁబ్రయత్నించినపుడు, సీతను విడిచి పెట్టి పోవఁబ్రయత్నించి, రాముడు, 'అడవిలో ముళ్లుండును, నీసుకుమారపాదములు వానిపై బడిన ముల్లుపై బడిన యరటియాకువలె చినింగిపోవును. నీవురావల'దని సీతతోఁజెప్ప నామెకోపముచెందిన యాడుసింగమువలె లేచి "నీకుముందునడచియాముండ్లనుద్రొక్కి పోవుచు నీకు దారిచేతునేగాని, నీవులేని నిక్కంపు యడవియగు నీపట్టణంబుననేను నిలువజాల' నని జెప్పినను విషయమును బాలికలమనంబును వృద్ధస్త్రీల మనంబును జొచ్చునట్లుచెప్పు. కథనుజెప్పబూని, మాటామాటకు

ముందే తత్ప్రియత్నసూచకముగ నీమెపైన జూచి నపు డీమె నేత్రములు రెండును జ్ఞానిప్రకాశముచేతను శుద్ధత్వముచేతను, శ్రోతలచిత్తంబుల నావరించియుండు యనవహితతా హిమంబు కరగిపోవు.

మన స్త్రీల విషయమయ్యు పాశ్చాత్య స్త్రీలవిషయమయ్యు వ్రాయుచు నొకచోట "హిందూ స్త్రీకి చదువురాదా? ఆమెకువిద్యశూన్యమా? ఎన్నటికినికాదు. స్ట్రాండ్ మాసపత్రికను చదివినంతటనే మన(యనగా పాశ్చాత్య) స్త్రీ విద్యావతి యయ్యెనా? హిందూ స్త్రీ తన దినచర్యలను నుడులను విద్యానిధివలె ప్రవర్తించుచున్నయది. బిడ్డగానున్నపుడు తల్లితండ్రులే దైవములనివారియందు మిక్కిలి గౌరవమును జూపును. పెనిమిటి దైవమనినమ్మి యతనినట్లే గౌరవించి మానసికపూజాయుక్తయై యతనికిని తనకును సుఖమును జేగూర్చు. తనబిడ్డ దైవాంశమని హిందూజనయిత్రి నమ్మి యాబిడ్డకాత్మగౌరవమును ధర్మచింతను గలుపుచుండు. ఇంతటి సాత్త్వికచర్య పాశ్చాత్యులయందును చూడలేము." అనిచెప్పియున్నది. ఇట్లుచెప్పినను, మన

స్త్రీలయందలి కాలాగతమైన యాచారధర్మముల మెచ్చుకొనినను, వారికి కాలవశమున వాటిల్లిన బుద్ధి మాంద్యమునకుచింతించియు, కొన్నివిషయములప్రాచ్య స్త్రీలు పాశ్చాత్త్యులనుండి నేర్చుకొనవలసియున్న దనియు, ఈయమ నుడివియున్నది.

చదువరులకు క్రొత్తసంగతుల నొకదానివెంబడి మఱియొకదానినినేర్పివారిని నిఘంటుప్రాయులుగజేయుట యనుచితమనియు, వారిమనంబులకు సత్త్వభావంబును దార్ఢ్యమునుగఱపి వారిని వినీతులుగజేయవలయు ననియు నీయమ దృఢాభిప్రాయములైయుండె. స్త్రీలీ పద్ధతిని జ్ఞానవంతులైన వారిజన్మంబు లపూర్వప్రయో జనత్వమును వైభవమును బడయునని యీయమ నమ్మిక. స్త్రీజన్మంబునకు క్రొత్త వ్యాఖ్యానమును క్రొత్తనిదర్శనంబును గల్పింప నీమెయొక్క జన్మోద్దేశ ముగానుండె.

## శ్రీరామకృష్ణ వివేకానందులు.

ఆర్యావర్తముయొక్కయు భారతవర్షముయొక్కయు పూర్వచిహ్నమే మాసిపోవుచున్నది, దానిని జ్ఞాపక ముంచుకొనుటకు కూడ శక్తిలేక యనర్హులమైయు

న్నాము. మనపూర్వీకుల ధర్మములకు మనము కడు దూరులమై యున్నాము. ఇంతియేగాక జ్ఞాపకముంచు కొన్నవారిని గౌరవింపక వారిని హేయముగాజూచుచు, వారలఁగొన్నిసమయములఁ బరిహసించుచు మఱికొన్ని సమయముల వారికి అనాదరణ చూపుచు, ఉపన్యాస వేదికనెక్కి మనపూర్వౌన్నత్యమును గురించి మాటాడఁ బూనినవారిని నోరుమూయుమని కేకలువేయు సంతతి యాత్మఘ్నులమై యున్నాము. క్రొత్తనీళ్లువచ్చి ప్రాత నీళ్లనుకొట్టుకొనిపోయినదన్నట్టుమనపూర్వస్థితిని నిలుపు కొన్న వారమునుకాక క్రొత్తలైన పాశ్చాత్యులతోను సమానముగఁ దూగలేక నీటిలోఁ దోకయు, ఒడ్డునఁ దలయు వేసికొని నిస్సత్త్వమైన మొసలిబోలె నున్నా రము. నవీనపాశ్చాత్య తళతళలచే భ్రమగొని వాని యందే దృష్టిని నిగిడించుచున్నాము.

తనపూర్వస్థితినే మఱచిపోనియున్న శ్రీరామ కృష్ణుల జన్మమెట్లున్నదన రావణుని రాజ్యంబులో విభీషణుండున్నట్లు. వివేకానందులకంటికి శ్రీరామ కృష్ణులొక దేవాలయపు పూఁదోటలో నొకమూల స్వచ్ఛమైకాంతితో వర్ధిల్లుచున్న పుష్పమువలెకానంబడె.

హిందూదేశము తనపూర్వౌన్నత్య మనెడి చెట్లను, మొదలంట పెరికివేసికొనబోవు సమయమున, ద్వాదశ వర్షక్షామావసానమునలేచు మబ్బువలె శ్రీరామ కృష్ణులుదయించిరి.

'నాగురువులగు' వివేకానందులజీవితము శ్రీరామకృష్ణులవంటిది కాకపోవుటయే వారిగొప్పతనమునకును చింతామగ్నతకును కారణంబయ్యె. వీరిమన స్తత్వము కేవలమాధునికము. ధ్యాననిష్ఠనున్నపుడు గాని సాధారణసమయంబులగాని దైవదర్శనమును దనమనంబునఁబడసి ప్రాచీనమునులవలె సమాధిమగ్నులయినను, ఇక్కాలపు విషయములందుగూడ వీరి బుద్ధికిఁ జొరవగలదు. పాశ్చాత్త్యులలో గొప్పగొప్ప వారిబుద్ధులకలవిగాని యంశముల విషయమునవీరు నుడివిన యభిప్రాయములు ప్రశస్తములై యున్నవి.

### పశ్చిమము.

పాశ్చాత్త్యుల నాగరికతయొక్క సకలాంశములును తమస్థైర్యమును విడిచి చేతులవెల్లికలవేసినవి. ఈనాగరికతలవలన వీరికిఉచ్చస్థానము లభించదని తెల్లంబయినది.

పశ్చిమమున మనము గనునవి యెవ్వి? ప్రతిమనుజుఁడును తనకు 'హక్కు'రావలెననుట. హక్కువచ్చినంతటనే యాత్మతృప్తి. ఇతరులనడంచిపెట్టి తానుముందుకు రావలెనను యుద్దేశ్యమున నెంతటి నీచత్వమున్నదో దానిని పాశ్చాత్యులెఱుఁగలేక యున్నారు. హక్కులకై వీరుపడుపాటుల వెంగలితనము వీరికి గోచరమవుటలేదు.

వీరల కుటుంబములలో 'వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః" యనున్యాయము బాగుగఁజెల్లివచ్చుచున్నది. ఆత్మనిగ్రహములేదు. ఆత్మసుఖేచ్ఛహెచ్చు. వయస్సువచ్చినంతటనే పురుషులు భార్యచింతాభరితులై తల్లిదండ్రులక్కఱలేక, భార్యను భుజమున నిడుకొని పక్షివలెఁదిరుగఁగలుగుట వారి మొదటిహక్కు. తోఁబుట్టువుల క్షేమము విచారింప నక్కఱలేదు. పెద్దకుమారుఁడు తండ్రియాస్తినంతటిని బడసి, తక్కినవారు తక్కెడలోనికప్పలవలె నలుపురునునాలుగుదిక్కులపాలవుదురు. కూడజనించిన యాడుబిడ్డల క్షేమమును గోరి వారికిఁదగు వరునిగని వారినివానికిచ్చి ఆమెనొక

యింటికి యజమానురాలినిగ జేయక ఆమెకును హాక్కు అను నుక్కు కత్తి నొకదాని జేతికిచ్చి పంపుచున్నారు. తుదకీయుక్కు కత్తి వారిగొంతుకనే కోయునని యెఱుంగుట లేదు.

త్రెడ్డులేని తెప్పను నది కొట్టుకొనిపోయి దరిలేని యుదధిని (సముద్రము) జేర్చుగాలి పాలుచేసిన, అది యనాథమై కొంతకాల మటిటు కొట్టుకొనుచుండును. విశేషకాలము తమపై తనభారమును మోపిన యీ యనాథ యుడుపముపై కోపముగొని సముద్రపుటలలు దీనినెద్దియో కొండపై విసరికొట్టిన దానిపై బడి బ్రద్దలై నాశనము జెందును. అట్లే పాశ్చాత్యులలోని యాడు పడుచులును అనాథఉడుపములై యెన్నియోయిడుమల పడుచున్నారు. హాక్కు అను పందికొక్కు పాశ్చాత్యుల సుఖమును గాడెకు పెట్టుబొర్రె లనేకములు.

వారిలోఁ దొలికుమారుఁడే తండ్రియాస్తికంతటికిని హాక్కుదారుఁడౌ కారణమున, దేశములోని ధనమంతయు, కొద్దిమందిచేతఁజిక్కి చాలమంది ధనహీనులై చెప్పరానిదుఃఖములకు పాత్రులవుచున్నారు. పాశ్చా

త్ర్యలలో 'ఉన్నవారికి ఉద్ది లేనివారికిసద్ది' యనున్యా యము నెగడుచున్నయది.

గురువు.

'ప్రాచీనుల తెలివికూడ నిట్టిదేయైయున్నదా ? అట్లైన మానవకోటికి మార్గమేలేదు. నాగురువులజీవితమే యీవిషయమున సమాధానము. వీరి జీవిత స్వభావమెట్టిది? హిందూదేశమునం బూర్వమున వెలసిన లెక్కలేని దేశికులయొక్కయు ఋషులయొక్కయు దివ్యజ్ఞానసారముయొక్కగడ్డ. ఇంతమాత్రమే యయిన నదియొక విశేషముగాదు.

వ్యాధిగ్రస్తుఁడయి మంచమునఁ గృశించుచున్న వానింబోలు హిందూదేశమునకు, జీవదానమునొసంగఁ గల వైద్యునివలె నీమహనీయుఁడు శక్తింగోలుపోయి నిస్సత్త్వమున మురుగుచున్న మనకు ధైర్యము చెప్పిన వాఁడు. నాఅజ్ఞానమును నొకపర్యాయపు హస్తస్పర్శనముచేతఁ బారదోలి తాపసికస్వభావమును సాత్త్వికజీవనమును నాకుఁగరపిన మహనీయుఁడు. సన్యాసాశ్రమమునకు సూక్ష్మఛ్ఛాయగలిపించి నవీనసన్యాసిబృంద

మున కాదికారకుడైనవాఁడు. సన్యాసమన్న తనసంసారభారముల త్యజించుకొనుటకు మారుగా, లోకములోని సర్వభూతాళియొక్కయు సుఖదుఃఖభారముల నెత్తినబెట్టుకొని, కష్టములపాలైయున్నవారిని దరిజేర్పు యుత్సాహంబును సదా గలిగి, దుఃఖసముద్రమున పడినవారివెంబడిదుమికి వారినియొడ్డునకు తెచ్చుటయనియు స్పష్టపరచినవాఁడు. సన్యాసమన్న తనభారముల నితరులపై యుంచుటగాక, లోకముయొక్క భారమును తనపైయుంచుకొనుట యని తనచరిత్రమువలన నిరూపించినవాఁడు.

ప్రశస్తములైన పూర్వాపూర్వజ్ఞానములనెడి రెండు మామిడిమొలకలు చేరి పరిణమించిన యుత్కృష్టమైన అంటుమామిడివృక్షమని పేరెంగూర్చి చెప్పందగు. జ్ఞాననిధి. వివేకవార్ధి. కరుణారసమును స్రవించు కల్పవృక్షము!'

మగింపు.

వివేకానందులు మనదేశమునకై పడినపాటులు వర్ణనాతీతములు, వారిబోధనలువిలువలేనివివేకధనము.

ఒక్కొక్క దేశమున జలధనము, వృక్షధనము, పర్వత ధనము, అందలిధాతుధనమును, లోహధనమును, మృగధనమును యింకను ననేకధనములుగలవు. జ్ఞాన ధనముమకలదు. మన దేశపు జ్ఞానధనమునకు వివేకానందులు విశేషముగాఁ జేర్చినవారు.

వీరుభారతమాతకై కూర్చినధనములలో నివేదితకు సమానమైన ధనములేదు. శ్రీరాముని జీవితమున కాంజనేయుడు తోడ్పడినట్లు వివేకానందులజీవితమునకు నోబ్ల్ తోడ్పడినది. ఆయన బ్రహ్మచారి. ఈమె బ్రహ్మచారిణి. ఆ[illegible] సూర్యునిశిష్యుఁడని వాల్మీకాదులకాలమునుండి [illegible]కలదు. ఇక్కాలపు గొప్పవారనేకులు ఈయ[illegible] ' సూర్యుడే ' యని చెప్పియున్నారు.

నివేదిత న[illegible]ంబుల నిలుచుఁగాక!

[illegible]ము.

# సంబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

## ప్రధానపోషకులు.

మ॥రా॥రా॥శ్రీ. మైదవోలు చెంగయ్యపంతులుగారు,
బి. ఏ., బి. యల్.

,, పెల్లేటి పెంచెలురెడ్డిగారు.

,, రేబాల వెంకటరెడ్డిగారు.

## పోషకులు.

గౌరవనీయులగు ఆమంచర్ల కృష్ణరావుపంతులుగారు,
బి. ఏ., బి. యల్.

మ॥రా॥రా॥శ్రీ. రేబాల సుబ్బరాయుడు పంతులుగారు,
బి. ఏ., బి. యల్.

,, మాడభూషి నరసింహాచార్లుగారు,
బి. ఏ., బి. యల్.

,, తూములూరు శివరామయ్య పంతులుగారు,
బి. ఏ., బి. యల్.

,, పెట్లూరు రామకృష్ణయ్య పంతులుగారు.

,, బచ్చు వెంకటసుబ్బయ్య శెట్టిగారు.

,, ప్రత్తి శ్రీరాములు శెట్టిగారు.

,, కుండా చెంచురామిరెడ్డిగారు.

మ|| రా|| రా|| శ్రీ గునుపాటి బలరామరెడ్డిగారు.
,, కాకుటూరు లింగారెడ్డిగారు.
,, దువ్వూరు సుబ్బారెడ్డిగారు.
,, పి. పీరారెడ్డిగారు.
,, పాలిచెర్ల రాఘవరెడ్డిగారు.
,, తిరువీధి కేశవులునాయుడుగారు.

## సహాయులు.

మ|| రా|| రా|| శ్రీ. వావిలకొలను నరసింగరావు పంతులుగారు, బి. ఏ. బి. యల్.
,, ఒవ్వేటి విశ్వనాధరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. వీ. రాఘవాచార్లుగారు, బి. ఏ., బి. యల్.
,, ధూర్జటి శేషయ్యపంతులుగారు, బి. ఏ.
,, జి. సాంబశివరావు పంతులుగారు, బి. ఏ. బి. యల్.
,, పెకటూరిజు రామచంద్రరావు పంతులుగారు. బి. ఏ., బి. యల్.
,, ఆకులపెంచెలు శెట్టిగారు.
,, పేరూరు వరదయ్య శెట్టిగారు.
,, గునుపాటి బాలవెంకటసుబ్బయ్య శెట్టిగారు.
,, నారాయణ రామయ్య శెట్టిగారు.
,, కసవరాజు వెంకటూరిపుగారు.

మ॥రా॥రా॥శ్రీ మిడుతూరు వెంకట్రమణయ్యగారు.
,, మల్లవరపు రామరావుగారు.
,, వలివేరు దత్తాత్రేయులుగారు.
,, ఆరాని సుబ్రహ్మణ్యంగారు.
,, మొదలి రాఘవయ్యగారు.
,, పాళ్లకట్టు సుబ్బరామయ్యగారు.
,, వారణాసి కృష్ణయ్యగారు.
,, నేలనూతల చెంచయ్యగారు.
,, పి. శ్రీరాంపిళ్లగారు.
,, కొమాండూరు పార్థసారధి అయ్యంగార్ గారు.
,, పత్తి నారాయణరావు పంతులుగారు.
,, యస్. వి. రామనుజరావుపంతులుగారు.
,, తాటికొండ వీరాచార్లుగారు.
,, పెట్లూరు వెంకటసుబ్బయ్యగారు.
,, యస్. యల్. యన్. రంగరావుపంతులుగారు.
,, పెజ్జాయి రాఘవరెడ్డిగారు.
,, పబ్బిశెట్టి శేతుమాధవయ్యశెట్టిగారు.
,, అల్లంపాటి చెంచురామిరెడ్డిగారు.
,, కాటంరెడ్డి చినరామచంద్రారెడ్డిగారు.
,, రాయి యల్లమందయ్యగారు.
,, బండి చెంచురామిరెడ్డిగారు.
,, కలికి రామచంద్రారెడ్డిగారు.
,, గుడిజాల సుబ్రహ్మణ్యముగారు.

మ॥రా॥రా॥శ్రీ టి. సుబ్బరాయుడుగారు.
,, రాచర్ల కృష్ణమ్మనాయుడుగారు.
,, కొమాండూరు వెంకటాచార్లుగారు.
,, జరుగుమల్లి పెంచెలురెడ్డిగారు.
,, పాదర్ల రామలింగారెడ్డిగారు.
,, అంబటంగురుమూర్తిగారు.
,, పి. గోపాలాచార్లుగారు.
,, సి. వెంకటరెడ్డిగారు.
,, యం. రాఘవయ్యగారు.
,, కోడూరు శేషురెడ్డిగారు.
,, తిక్కవరపు శీతారామరెడ్డిగారు.
,, ములుమూడి వెంకటసుబ్బయ్యగారు.
,, వెన్నెలకంటి కృష్ణస్వామిరావు పంతులుగారు
,, పూండ్ల సుబ్రహ్మణ్యంగారు.
,, ధరణికోట వెంకటశేషయ్యగారు.
,, విస్సా శేషగిరిరావుగారు.
,, మోచర్ల శ్రీరాములుగారు.
,, యేటూరు కోదండరామిరెడ్డిగారు.
,, యెరబోలు రామచంద్రారెడ్డిగారు.
,, యేలూరు రామకృష్ణారెడ్డిగారు.
„ నూకలపాటి వెంకారెడ్డిగారు.
,, మునిమూడి నారాయణరెడ్డిగారు.
,, భట్టారం రంగయ్యగారు.
,, యస్. గోపాలకృష్ణగారు.

మ॥రా॥రా॥శ్రీ ఆములూరు వెంకయ్యానాయుడుగారు.

,, పొనకా పట్టాభిరామరెడ్డిగారు.

,, అనుపల్లి నారాయణరెడ్డిగారు.

,, అల్లూరు రామిరెడ్డిగారు.

,, పర్వతరెడ్డి చినరామచంద్రారెడ్డిగారు.

,, పల్లంరెడ్డి బాలరెడ్డిగారు.

,, కే. వీ. సుబ్రహ్మణ్యంగారు.

,, మొరబోలు శంకరరెడ్డిగారు.

,, నూకలపాటి వెంకటపతిరెడ్డిగారు.

,, బెజవాడ పట్టాభిరామరెడ్డిగారు.

,, లేబూరు సుబ్బరామరెడ్డిగారు.

,, కొండా వీరరాఘవరెడ్డిగారు.



శ్రీ

# సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

---:౦:---

ఇందు సుబోధకంబులగు సుప్రసిద్ధ మహాపురుషుల జీవితచరిత్రములు, వారిబోధనలు, నవలలు, ఉపన్యాసములు మొదలగునవి ప్రచురింపఁబడును.

రెండేసినెలలకు సుమారు 100 పుటలుగల గ్రంథము చొప్పున ఆరునెలలకు మూఁడుగ్రంథములు వెలువడును.

ఆరునెలలకు ఒకపర్యాయము ప్రథమగ్రంథము వెంట చందాదారులు రు 1-0-0 య, సహాయులు రు. 2-0-0 లు, పోషకులు రు 5-0-0 లు, ప్రధానపోషకులు రు10-0-0లు, చెల్లించవలయును. రు10-0-0లకు పైగా చెల్లించువారు రాజపోషకులు.

చందాదారులకు కాకితపు బైండు పుస్తకములనిచ్చెదము. తక్కిన తరగతులవారికి క్యాలికోబైండుగల దళసరికాకితముల గ్రంథములనిచ్చి వారిపేర్లను ప్రతిగ్రంథమునఁ బ్రచురింతుము.

తపాలాఖర్చులు మేమేభరించెదము.

# సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

## ప్రథమ గ్రంథము.

### పంచమజార్జి చక్రవర్తి.

ఇందు మన చక్రవర్తిగారి జీవిత చరిత్రము విపులముగా వ్రాయబడినది. 140 పుటలు అందమైన రేపరు బైండింగు వెల 0—6—0, క్యాలికో ప్రతి 0—8—0.

## PRESS OPINIONS.



THE EDUCATIONAL REVIEW, MADRAS:—

"No attempt has hitherto been made to present the life of our King-Emperor in simple, chaste, and idiomatic Telugu; and the volume before us will be a welcome addition to Telugu biographical literature. There is enough indication in the book to show that the author has availed himself of all the existing material to present the life of the King-Emperor in an attractive form to school children. The book opens with a simple chapter on the Hanoverian line of Kings. We notice that a number of interesting anecdotes are put in to make the book highly interesting .........The aim of the author evidently was to inculcate in hildren's mind correct ideas of devotion

and attachment to our King-Emperor. We are glad to find that the style of the book throughout is simple without being vulgar.........

THE MADRAS MAIL, MADRAS:—

'......an eminently well written life in Telugu of H. M. George V, King-Emperor of India......'

THE INDIAN PATRIOT, MADRAS:—

"......a very useful book.........The book deserves to be placed in the hands of young men"

సువర్ణలేఖ, తణుకు:—

"...శ్రీయుత మన్నేపల్లి రామకృష్ణరావు గారిచే ఇది అతిసులభమగు శైలిని రచింపఁబడినది. శ్రీ పంచమ జార్జి చక్రవర్తి చరిత్ర మందరు చదువఁదగినది...ఈ సుబోధినీ గ్రంథమాల వారు ఆంధ్రదేశమున కత్యుపకార మొనరించుచున్నారు."

రవి, కాకినాడ:—

"—ఈచరిత్రము 17 అధ్యాయములలో చక్రవర్తిగారు హిందూదేశమున పట్టభద్రులై మాతృభూమి చేరువరకు సులభమైన భాషాశైలిని వ్రాయబడి యున్నది. ఇది ప్రతివారును జదువఁదగిన యుపయోగకరమైన చరిత్రమని తలంచుచున్నాము. ఈ సంఘమువారి ప్రచురములలో నీచక్కని చరిత్రము ప్రథమ గ్రంథముగా ముద్రింపబడుట వారు పూనుకొనిన యుద్యమమునకు ప్రశంసదెచ్చును."

---

సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

# సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

రెండవగ్రంథము.

## రామతీర్థస్వామి.

పంజాబు దేశమునందు జన్మించి 20 సంవత్సరముల ప్రాయముననే గణితశాస్త్రమున యం. ఏ. పరీక్షయందు ఘనముగా జయప్రదులై, ప్రాపంచిక భోగముల నాసింపక పిన్న వయస్సుననే సన్యసించి, జగత్ప్రసిద్ధులయిన శ్రీవివేకానంద స్వాములవలెనే విదేశములకేగి వేదాంతమత ప్రచారమున పాశ్చాత్యుల మనముల నాకర్షించి, మాతృదేశమునకు విచ్చేసి, తన యావజ్జీవమును లోకోపకారార్థమై వినియోగపరచి, 1906-వ సంవత్సరమున గంగానదిలో మునిగి విగాతసులైన ఈమహా పురుషునియొక్క జీవితము సంగ్రహముగా సులభశైలిని వ్రాయబడినది. ఆంధ్రభాషయందు ఈమహనీయుని గురించిన ప్రథమ గ్రంథమిదియే. గావున ఆంధ్రులందరు ఆదరింపదగినది.

| | | |
|---|---|---|
| 106 పుటలు | క్యాలికో ప్రతి 1-కి | రు 0-8-0లు. |
| | రేపరు ప్రతి | రు 0-6-0లు. |

ధర్మసాధని, కాకినాడ.

"...ఇయ్యది మిక్కిలి యుపయుక్తమైన గ్రంథము. ఎల్లరకు సుబోధకముగానుండునట్లు లలితమైన భాషలో వ్రాయబడినది. మొదటినుండి కడవఱకుఁజదివి మేము మిక్కిలి యానందించితిమి. రామతీర్థస్వామి గొప్ప వేదాంతి; కవీశ్వరుడు, మహాపండితుఁడు; దేశభక్తుడు; సంఘసంస్కరణాభిమాని...ఈగ్రంథము నెల్లవారును జదివి సత్యమును గ్రహించి ధన్యులగుదురుగాక!"

యం. ఆర్. కృష్ణరావు & కంపెనీ, నెల్లూరు.

# సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

## మూడవగ్రంథము.

# శంకరాచార్యులు.

సకలోర్వీమండల మండనంబైయొప్పు నీభరతఖండము నందు అధర్మము ప్రబలి మతములు చెడుత్రోవల ద్రొక్క నపుడు మహాపురుషులుదయించి ధర్మ సంస్థాపన మొనర్చు టయు, అట్టి పుణ్యపురుషులలో నొకరు శ్రీఆదిశంకరులనియు లోకవిదితము. బౌద్ధమతప్రాబల్యమున బ్రాహ్మణమత మడుగం టుచుండ, బ్రాహ్మణమతమునందనేక దురాచారములు దుర్మ తములు బయలుదేరి నిజమును మఱుగుపఱచుచుండ, నట్టితఱుణ మునం దీమహనీయు డవతరించి బ్రాహ్మణమతము నుద్ధరించి, దుర్మతముల ఖండించి అద్వైతమతస్థాపన మొనర్చి, జగద్గురువను సార్థకబిరుదమున బ్రఖ్యాతిఁగడసి, యంతర్ధానమయ్యె. స్మార్తు లందరకన నేల ? ఆంధ్రులకందఱ కీలోకపూజ్యుని చరితము సుల భముగ దెలియుట కవకాశమిచ్చుటకై శంకరునిగుఱించిన సంస్కృతగ్రంథములనుండి ఈగ్రంథమును రచియింపించి ప్రచు రించితిమి. వెల మిక్కిలిస్వల్పము. కాకితపు బైండుగ్రంథము ప్రతి 1 కి 0-6-0, క్యాలికో ప్రతి 1 కి 0-8-0, ప్రతిస్మార్తుని గృహమునతప్పకనుండవలసిన గ్రంథము. కొద్దిప్రతులు మాత్రమే కలవు. త్వరపడికొనుండు.

---

యం. ఆర్. కృష్ణరావు & కంపెనీ, నెల్లూరు.

## శ్రీరామచంద్రలీలాతరంగిణి

యను హరికథయందు

# అయోధ్యాకాండము.

శ్రీమద్వాల్మీకి మహర్షి ప్రణీతంబగు శ్రీమద్రామాయణమునను సరించి ఈగ్రంథము హరికథరూపముగా, నెల్లూరు మండలములో చేరిన కనిగిరి గ్రామంబున న్యాయవాది ఉద్యోగమునందుండి కీర్తిశేషులైన మన్నేపల్లి వెంకటాచలం పంతులుగారిచే మిక్కిలిరసవంతంబుగ రచియింపబడినది. కీర్తనలతి మనోహరములై శోకరసమున నుప్పతిల్లుచు శ్రోతలయంతఃకరణముల నాకర్షించు శక్తిగలవి. వేలకొలది స్త్రీపురుషులీగ్రంథమును చదివియు, హరికథగా జెప్ప వినియు, కవిసార్వ్యని సామర్థ్యమును మెచ్చుకొనియున్నారు. ఇంతేల ! ఒకపర్యాయము మీరు చదివినగదా స్వానుభవమున నన్నియు తెలియనగును.

వెల ప్రతి 1కి 0-6-0

---

యం. ఆర్. కృష్ణరావు & కంపెనీ. నెల్లూరు.

M. S. Krishna Rao
& Co
Nellore



# "YOUNG MEN AND SOCIAL SERVICE"

A Reprint of an interesting address

DELIVERED BY

**Pandit Bishen Narayan Dhar**

*Bar-at-Law, Lucknow,*

AND

*President, I. N. Congress, Calcutta.*

***Most instructive***

**TO**

*Young men & Students,*

Price 4 as. per copy.

***6 copies at a time,***

**3 annas per copy only**

Krishna Rao & Co., Nellore.

Krishna Rao & Co
Nellore



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B181 |
| పుస్తకం పేరు | నివేదిత |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 143 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | A, B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | C. Daveed |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |